# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

**Monday, 13th August, 1956.**

The House met in the Assembly Hall Kurnool, at half past eight of the Clock, Mr. Speaker (The Hon. Sri. R. Lakshminarasimham Dora) in the Chair.

---

## I. QUESTIONS AND ANSWERS

## STARRED QUESTIONS

Mr. SPEAKER: questions nos. 61 and 62 may be answerd together.

*Increasing Salaries of Elementary School Teachers.*

61—

* 77 Q—Sri M. NAGI REDDI:
Sri N. C. SESHADRI:
Sri M. RAJARAM:
Sri VAVILALA GOPALAKRISANAYYA:
Sri S. VEMAYYA:

Will the Hon. the Chief Minister be pleased to state-

(a) whether the Central Government have made any suggestions to the Andhra Government to increase the salaries of the Elementary School Teachers;

(b) whether the Central Government have also intimated the State Government that they will pay 50 per cent of the extra expenditure to be incurred therefor; and

(c) if so, what action have this Government proposed to take in the matter?

THE Hon. Dr. B. GOPALA REDDI:

(a) The answer is in the affairmative.

(b) Yes; till the next Finance Commission is set up.

(c) This Government have intimated to the Goverment of India, the existing scales of pay and the revised scales of pay they propose to consider and have requested them to indicate the quantum of assistance they would give. Their reply is awaited.

13th August 1956)

*Increase of salaries of Elementary School Teachers.*

62—

* 187 Q- Sri P. BASI REDDI:- Will the Hon. the Chief Minister be pleased to state-

(a) whether there was any offer of subsidy from the centre recently for increasing the salaries of the Elementary School Teachers in the State;

(b) if so, the conditions of the offer;

(c) the number of teachers who will get such benefit;

(d) the recurring expenditure which the offer involves for the State Government; and

(e) whether the Government have accepted the offer?

THE Hon. Dr. B. GOPALA REDDI:-

(a) The answer is in the affirmative.

(b) The Central Government offered to give assistance up to 50% of the additional expenditure involved till the next Finance Commission is set up in raising the salary scales of primary teachers suitably consistant with local conditions. They have stated that the State Governmentmust assume responsibility for meeting their share of additional expenditure that would be incurred in raising the salaries of teachers. They have suggested that the possibility of economising on the expenditure to be incurred on construction of school buildings should be explored, the money thus saved may be utilised in raising the salary scales. They have also suggested that a special education cess might be levied by the State in order to meet their share of the expenditure on the improvement of salary scales.

| | | |
|---|---|---|
| (c) (1) | Existing Primary School teachers who will be benefited by it ... ... | 16,425 |
| (2) | Number of primary school teachers who will be employed in 1956-61 | 58,629 |
| | Total number of teachers who will be benefited by it. ... ... | 75,054 |

(d) In 1956-57 Rs. 65,91,768
During 1956-61 ,, 3,38,12,940

(e) It has been suggested that before accepting the offer of the Government of India they should be requested to indicate the quantum of assistance they would give. They have accordingly been addressed. Their reply is awaited.

13th August 1956)

SriVAVILA LAGOPALA KRISHNAYYA:-ఇప్పుడుGovernment ఈ నిర్ణయాన్ని అమలు చెయ్యమంటున్నారు ఇందులో 50% ఇస్తామని చెప్పారు. 50% ఎప్పు డూఇస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- Finance Commission వచ్చేంతవరకు, అంటే 1957 April వరకు అన్నమాట.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:-ఆ తర్వాత దాని సంగతి Finance commission తేల్చాలని అభిప్రాయమా లేక Provincial Government పెట్టుకోవాలని అభిప్రాయమా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- ఈ విషయం వాళ్లు చెప్ప లేదు. Commission వచ్చేంతవరకు, వాళ్ల నిర్ణయాలు వచ్చేంతవరకువారు ఇస్తామని చెప్పారు. తర్వాత మాకు 3 కోట్ల 35 లక్షల పైన అవుతుంది. దీనికి ఎంత ఇస్తారని అడిగితే దానికి జవాబు రాలేదు.

Sri R. B. RAMAKRISHNA RAJU:- Additional Education Cess వేసుకోమన్నారని చెప్పారు, ఆ మాదిరిగా వేయడానికి గవర్నమెంటు తలపెట్టిందా?

The Hon. Dr. B. GOPALA REDDY:- మేము దానికి కూడా జవాబు వ్రాశాము. Act లో maximum 36 దమ్మిడీలని ఉన్నది, ఆ 36 దమ్మిడీలను జిల్లాబోర్డువారు విధిస్తున్నారు. ఇప్పటికి ఇంతకన్న ఎక్కువ చేయడానికి వీలు ఉండదేమోనని కూడా వారికి సూచించాము.

Sri R. B. RAMAKRISHNA RAJU:-ప్రస్తుతం Estate ప్రాంతాలలో రూపాయకి 5 అణాల వంతున Cess వసూలు చేస్తున్నారు. అది చాల భారంగా వారు తలుస్తున్నారు. అందువల్ల దానిని గురించి గవర్నమెంటు యోచించి additional cess వేయడం సాధ్యంకాదని కేంద్ర ప్రభుత్వము వారికి తెలియ చేస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI:- ఆ మాటే సోదర సభ్యులు కూడా తెలియచేస్తే మంచిది.

Sri S. VEMAYYA:- ఇండియా గవర్నమెంటుకు వ్రాశామని చెప్పారు. ఈ scheme ను అమలు పరచేదానికి ఇంకా ఎక్కువ డబ్బు ఇవ్వమని కోరుతూ implement చేయడానికి వ్రాశారా? లేక దానిని మేము భరించలేమని వ్రాశారో తెలుసు కోవచ్చునా?

(13th August 1956

The Hon. Dr. . GOPALA REDDI:- ఎగ నామము పెట్టడానికి ఏమి వ్రాయలేదు. మేము ఎక్కువ చేస్తామని కూడా చెప్పలేదు. scales of pay ఇంత ఉన్నదని చెబుతూ మేము యదలచు కొన్నది అంతా కూడా indicate చేసినాము. ఆ మాదరి లెక్కలు వ్రాసుకుంటే 3 కోట్ల 38 లక్షలు అవుతుంది. దీనిలో మీరెంత ఇస్తారో చెప్పండి అని వారికి వ్రాసినాము

Sri N. P. CHENGALRAYA NAIDU:- రైతుల వద్దనుంచి Additional cess వసూలు చేస్తున్నారు. ఇప్పుడు క్రొత్తగావిధించే ఈ 36పైసలను Business turnover పైన రూపాయకు ఇంత అని cess వేయకూడదా?

The Hon. Dr. B. GOPALAREDDI:- Sales tax క్రిందBusiness turnover మీద వేసేటటువంటి assesment మాదిరిగా Education Surcharge వెయ్యకూడదా? అని వారు అంటున్నారు. దానిని Sales Tax Act వచ్చినపుడు ఆలోచిస్తాము.

Sri M. NAGI REDDY Elementary School Teachers విషయంలో ఏ ఏ గ్రేడుకు ఎంతెంత పెంచాలని ప్రభుత్వము recommend చేసినది?

The Hon. Dr. B. GOPALA REDDI :- Local bodies ఉన్నటువంటి higher grade untrained teachers కు 20 రూపాయలు ఇస్తున్నారు. Aided Schoolsలో 15 రూపాయలు ఇస్తున్నారు, అది 25 రూపాయల వరకు పెంచాలని, D.Aఈయవలెనని, rec-mmend చేశారు. Higher grade trained teacher's Government scale కు రు. 30-1-50అని ఉన్నది. Local Bodies 30-1-45 అని ఉన్నది.Aided schoolsలో 27-½-30 అని ఉన్నది. దానిని 40-60 చేసి D.Aఇవ్వాలనే సూచన కూడా ఉన్నది. Secondary grade untrianed teacher's under all management కు Governmentలో లేదు, Local bodies లో 25 రు. aided లో 18 రు. ఇస్తున్నారు. untrained కాబట్టి Proposalలో 35 రు. అని ఉన్నది. Second grade under all managenemts Government లో ఇప్పుడున్న Scale 45-3-60 1-90. Local bodies లో 40-1½-55 275 aided Schoolsలో 37-1-45అని ఉన్నది. అది 55-100 చేసి దానిమీద D A ఇవ్వాలనే. proposal క్రింద లెక్క వేస్తే 3 కోట్ల 38 లక్షల రూపాయలుSecond five year plan లో కావలసి వస్తుందని వ్రాశాము

13th August 1956)

Sri P. NARSIMHAPPA RAO:- అధ్యక్షా, బొబ్బిలి estate villages ఉన్నాయి. అవి unsuyed villages వాటిలో ఎకరానికి 30 రూ॥ల వరకు శిస్తు వసూలు చేస్తున్నారు, వాటిని గవర్నమెంటు ఏమిచేయ దలచుకొన్నారు. వాటికి ఈ cess లేకుండా చేయాలనే ఉద్దేశ్యము ఉన్నదా?

The Hon Dr. B. GOPALA REDDI:-- Survey Settlement వాళ్లు rent reduction Act క్రింద అది అంతా పరిశీలన చేస్తారు.

Sri L. LAKSHMANA DAS:- అధ్యక్షా, కుప్పుస్వామి కమిటీలో Publication of books వల్ల చాలడబ్బు వస్తుందనే suggestion ఇచ్చారు దానిని గురించి ప్రభుత్వము examine చేసినదా?

The Hon Dr. B. GOPALA REDDI :-- చాలా active గాconri der చేస్తున్నాము. త్వరలో G. O కూడా issue అవుతుంది.

Sri G, YELLAMANDA REDDI :- 50% ఇస్తామని కేంద్ర ప్రభుత్వం ముందుగానే వ్రాసినది. అటువంటప్పుడు మరల వాళ్ళను ఎంత ఇస్తారని అడగటంలో అర్థం ఏమి ఉన్నది. అన్ని రాష్ట్రాలు ఒప్పుకున్నట్లు మన రాష్ట్రం ఒప్పుకోనట్లు వార్తలు వచ్చాయి అవి ఎంతవరకు నిజము?

The Hon. Dr. B. GOPALA REDDI :- Till next Finance Commission is setup ఇస్తామన్నట్లుగా వారు చెప్పారు. మనం 1955 లో తీసుకొన్నప్పటికి 1955-56, 1956-57 లో ఇస్తామని చెప్పారు. మాకు 5 సంవత్సరాలకు 3 కోట్లు 38 లక్షలు అవుతుంది. Finance Commission వచ్చిన తరువాత మీరు ఇవ్వడం లేదు అంటే ఒకసారి ఎక్కించి మళ్ళీ తగ్గిస్తే బెజవాడ ఏలూరులో ఆందోళన వస్తుందేమోనని ఒక్కసారే ఏమి ఇస్తారో చెప్పండి? 5 ఏండ్లకు మాకు ఇంత ఖర్చు అవుతుంది, ఈ 5 ఏండ్లకు మీరు ఎంత ఇస్తారో ఖచ్చితంగా చెప్పండి అని కోరితే దానికి మాత్రం జవాబు రాలేదు.

Sri. B, SHANKARAIAH :- 5 సంవత్సరాలకు కలిపి ఆ విధంగా లెక్క వేసి చెపుతున్నారు. Teachers లో ఇప్పుడు ఉండే జీతాల పరిస్థితిని బట్టి చూసినట్లయితే ప్రజలందరుకూడా కేంద్ర ప్రభుత్వము సగము ఇచ్చేటప్పుడు. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ఇవ్వాలనే కోరుతున్నాయి. అందువల్ల 5 సంవత్సరాలకు 3 కోట్లు అవుతుందని బ్రహ్మాండంగా లెక్కలు చూపించకుండా సంవత్సరానికి

ఇంత అవుతుందని వేసి, ప్రజాభిప్రాయాన్ని అనుసరించి కేంద్ర ప్రభుత్వం ఇచ్చే సహాయాన్ని తీసుకొని టీచర్లకు జీతం పెంచడానికి ఆలోచిస్తున్నారా?

The Hon. Dr. B. GOPALA REDDI :- 5 కోట్లు అని 3 కోట్లు 38 లక్షలు అని చెప్పి వారిని భయపెట్టడం లేదు. నా జవాబులోనే నేను చెప్పాను. 1956-57 లో 65, 91, 768 రూపాయలు అవుతుంది అని 5 సంవత్సరాలలో 3 కోట్ల 38 లక్షల అవుతుందని చెప్పాను, సంవత్సరానికి 65 లక్షలు రూపాయలు అవుతుంది కాబట్టి Education cess వేసుకోకూడదా, ఇంకేదైనా వేసుకో కూడదా అని సలహాలు చెప్పారు. ఇక్కడ ఉండేటటువంటి ఇబ్బందులన్నీ కూడా మేము వారికి చెప్పినాము. కాబట్టి ఆ విషయంలో గౌరవ సభ్యులు నిర్మాణాత్మకమైన సూచనలు చెయ్యాలని కోరుతున్నాము.

Sri M. NAGI REDDI:- కుప్పుస్వామి కమిటీ రిపోర్టులో పుస్తకాలు Printing గురించి, ఇప్పుడు చెప్పినదానిలో అది ఆలోచిస్తాము. G. O. issue చేస్తాముఅని అంటున్నారు. అది చేసినట్టైతే దాంట్లో ఎంతఆదాయము వస్తుంది, ఎంత నష్టము వస్తుందో తెలియజేస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- దాంట్లో ఎక్కువ వస్తుందని మేము అనుకోడం లేదు. అది ఇప్పుడు ఉండేటటువంటి పద్ధతి బాగలేదు అనే టటువంటి ఉద్దేశముతో చేస్తున్నదే గాని, కేవలం ద్రవ్యాన్ని అర్జించడం కోసం చేస్తున్నటువంటి scheme కాదు. క్రమేణా, ఇంకా 10,15 సంవత్సరాలైన తరువాత ఏదైనా ఆదాయము రావచ్చునేమో. కాని ముందు కొంత నష్టము కూడ పడవలసి వస్తుందేమో అనుకొంటాను.

Sri P. GUNNAYYA:- కేంద్ర ప్రభుత్వమువారు ఈ elementary ఉపాధ్యాయులకు ఏదో కొంత సహాయము చేస్తారని మంత్రిగారు శెలవిచ్చారు. మన State Government వాళ్ళు సహాయం చేస్తే 65 లక్షలు అవుతుందని అంటున్నారు. ఈ 65 లక్షల రూపాయలు ఏ కొంత sur-charge వేసినప్పటికీ సరిపోతుంది. Elementory ఉపాధ్యాయులు చాలా కష్టపడుతున్నారు. కాబట్టి వారికి జీతాలు హెచ్చుచేయడానికి ప్రభుత్వము పూనుకొంటుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- ఈ సంవత్సరం 4,72 లక్షలు dificit వచ్చింది. దానికి ఇంకొక 65 లక్షలు కలిపితే 5 కోట్ల చిల్లర అవుతుంది. ఎటూ మునిగినాము, ఎంత మునిగినా పరవా లేదు అను కొన్నట్లయితే చేయవచ్చు. తరువాత ఈ Teachers కు ఇస్తే, అది అంతటితో ఆగదు.

13th August 1955)

మళ్ళీ Village officers వస్తారు. మళ్ళీ N. G. Os వస్తారు. మళ్ళీ Police constables వస్తారు. కనుక ఇవన్నీ మనస్సులో పెట్టుకొని ఏదైనా increase చేస్తే మంచిదిగాని, ఇప్పుడేదో వాళ్ళు వాగ్దానము చేశారు కాబట్టి వారు ఇచ్చింది తీసుకొని ప్రయత్నం చేస్తామంటే దీనియొక్క wide repercussions ఆలోచించ వలసి యుంటుంది.

Sri R. B. RAMAKRISHNA RAJU:- ఈ three Crores అనేది State's share అంటారా లేక total expenditure అనియా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- అది Total expenditure. అసలు వారేమి ఇస్తామని అనుకొన్నారో ఇంకా తెలియలేదు. ఒక సంవత్సరం, 1956-57లో ఏదో ఇస్తారు. తరువాత ఇవ్వడం లేదంటే, we will be in suit.

Sri K. SUBBA RAO:- ఇప్పుడు రాష్ట్రములో ఉపాధ్యాయులకు ఖర్చు పెట్టేటటువంటి మొత్తానికి సరియైన ఫలం ప్రజలకు లభించుతూ ఉన్నదని ప్రభుత్వము వారు గమనిస్తున్నారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:–అది నేను చెప్పడం మంచిది కాదేమో. ఆ విషయము గౌరవనీయసభ్యులకే ఎరుక.

Sri S. VEMAYYA:- ఇప్పుడు ఉన్నటువంటి schools లో aided schools లో ఒక scale, Ditrict board schools లో ఒక scale, Government schools లో ఒక scale ఉన్నది కాబట్టి ఈ తారతమ్యం లేకుండా చేసే దానికి ప్రభుత్వము ఏమైనా పూనుకొంటుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- కొంత పూనుకొంటూ ఉన్నాము. ఇకముందు జిల్లాబోర్డు scales ఇవ్వవలసిందని పోయిన సంవత్సరము ఒక G. O. వేశాము. Aided schools వేరే అనుకోండి. ఈ Government scales జిల్లాబోర్డు scales అనేది లేకుండా చేయడానికి కొంత ప్రయత్నం జరుగుతున్నది, జిల్లాబోర్డు scales ఇచ్చేటట్లు.

Sri T. JIYYAR DASS:- ఈ ప్రాథమిక విద్య అంతయు ఈ ఉపాధ్యాయుల చేతుల్లో ఉన్నది కదా ! దానిని పటిష్టం చేయాలని ముఖ్యమంత్రిగారు చాలా ఆశతో ఉన్నారు. అటువంటప్పుడు వారికి ఉపకారవేతనములను గనుక హెచ్చించక

పోయినట్లైతే ప్రాథమిక విద్యను చంపివేసేటటువంటి ప్రయత్నం చేసినవారవుతా రేమో అనే భయమేమైనా ఉన్నదా ప్రభుత్వానికి ?

The Hon. Dr. B. GOPALA REDDI:- ఆ భయమొక్కటే కాదు. ఈ ప్రభుత్వానికి ఇంకా అనేక భయాలున్నాయి.

## *Jamabandi of Tenali taluk.*

64—

90 Q--Sri VAVILALA GOPALAKRISHNYYA:-Will the Hon. the Minister for Revenue be pleased to state--

(a) whether it is a fact that the jamabandi for Tenali taluk was postponed in April due to the notice given by the village officers;

(b) if so, what are those demands ; and
(c) the action taken thereon by the Gevernment?

The Hon. Sri K. CHANDRAMOULI :--

(a) The answer is in the negative.
(b) The Tenali Taluk Village Officers' Association requested that the Jamabandi for the taluk, which was scheduled to begin from 17-4-56, should be postponed for one month in view of the Cattle Census work which had to be conducted by them from March 15th to April 16th. They also expressed their inability to prepare the Land Revenue Surcharge Registers.

(c) As the jamabandi programme was already published in the villages and also the District Gazettes, the jamabandi officers decided to conduct jamabandi according to programme, receiving petitions, so that no hardship might be caused to the ryots. The Settlement of accounts of such of the villages for which the village accounts were not ready was, however, postponed till the first fortnight of May or June 1956. The Government could not also comply with the request of the Association to exempt them from preparing the Land Revenue Surcharge accounts.

Sri. VAVILALA GOPALAKRISNAYYA :-జమాబంది అంటె రెండు రకాలున్నది. Petitions జమాబంది జరిపాము, Accounts జమాబంది జరగ

13th August 1956)

లేదు అంటున్నారు మీరు. ఆఫీసర్లు రాలేదని మీరుకూడ ఒప్పుకొంటున్నారు. రాకపోవడానికి కారణమేమిటి? ఇంతేకాకుండ, మీకు వాళ్ళు మెమొరాండాలు ఇచ్చారా?

The Hon. Sri K. CHANDRAMOULI:- నేను చదివిన answer జాగ్రత్తగా వినినట్లులేదు. Accounts తయారైనవాటికే కాకుండా, Settlement accounts తయారైన Villages లో కూడ చేస్తున్నాము, తక్కినవాటిని ఆపాము.

Sri VAVILALA GOPALA KRISHNAYYA :- అసలు జమాబంది ఆపివేసినట్లు పత్రికలలో announcement వచ్చింది. వారు boycott చేస్తామని చెప్పారు, తరువాత మీరు కలిసి మాట్లాడిన తరువాత వారు జమాబందికి ఒప్పుకొన్నారు, మీరు ఆ point చెప్పలేదు. అది చెప్పుతారా అని అడుగుతున్నాను.

The Hon. Sri K. CHANDRAMOULI :- పత్రికలలో ప్రకటించిన వన్నీ కూడ యదార్థంగా తీసుకోడానికి ప్రభుత్వానికి అవకాశంలేదు. అక్కడ ఉన్నటువంటి పరిస్థితులు బట్టి, officers, కరణములు అందరు కలిసి మాట్లాడుకొని, చేసుకొన్నారో ఏమో అంటే amecable గా చక్కగా చేసుకొన్నారు. ఇప్పుడు గోపాలక్రిష్ణయ్యకు మాత్రము ఈ ఇబ్బంది వచ్చింది,

Sri K. SUBBARAO :- ఈ జమాబందీలుpostpone చేసే విషయములో కొంతమంది Revenue Inspectors క్షోభము కలుగజేసుకొని రెడ్డి, కరణాలను పురికొల్పి చేసినటువంటిదని ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Sri K. CHADNRAMOULA:-నాకు తెలియదు.

Sri V. VISWESWARA RAO మంత్రిగారు చెలవిస్తూ Petition జమాబంది జరిగిందని, accounts జమాబంది తరువాత చేస్తామని చెప్పారు..

Mr. SPEAKER :- అలా చెప్పలేదండి.

The Hon. Sri K. CHANDRAMOULI:- 'Settlement of accounts of such of the villages for which the village accounts were not ready were, however, postponed" అని చెప్పబడింది. అంతే కాని తయారైన వాటికి కూడా postpone చేశామని ఉన్నదా అందులో?

Sri S. VEMAYYA:- ఈ జమాబందీలు తీసివేయాలని చాలాకాలంగా ఆందోళన జరుగుతున్నది. శాసనసభలోను, బయట కూడా. కనుక వాటిని తీసివేయడానికి ప్రయత్నమున్నదా?

2)

(13th August 1956

The Hon Sri K.CHANDRAMOULI:- వేమయ్యగారు, ఇంకా కొంత మంది అటువంటి అభిప్రాయముతో ఉన్నారేమో గాని రైతులందరు జమాబందీ కావాలని అంటున్నారు. రైతులకొరకే ఈ ప్రభుత్వమున్నది.

Sri M. NAGI REDDI :- ఈ Land census లెక్కలు, జమాబందీ ఇవన్నీ ఒకే సారి రావడము, ఇంకా మరికొన్ని ఇతర కారణాల వల్ల- అవి ప్రభుత్వానికి తెలుసు- Sur-charge లెక్కలు తయారు చేయలేక పోవడం- తరువాత వారిని పిలిపించి రాజీ చేయడం అనేది జరిగింది. అయినప్పటికీ ఆ సందర్భంలో మళ్ళీ కొంతమంది R. D. O. లు గ్రామోద్యోగుల మీద చర్య తీసుకొంటున్నారు. జరిమానాలు వేయడం, Suspensions చేయడం జరుగుతున్నది. కాబట్టి ఆ రాజీ ఫలితంగా ప్రభుత్వము అలాంటి చర్యలు తీసుకోకుండా Orders జారీచేస్తారా?

The Hon Sri K. CHANDRAMOULI :- రాజీ అయిన తరువాత కూడా, అనుకొన్న విధంగా వారు జరుపుతూ ఉంటే అటువంటి చర్యలు ఏమీ తీసుకోము. ఆ విధంగా కాక, రాజీ అయిన తరువాత కూడ ఇంకా పత్రికలలో Statements ఇవ్వడం. అటువంటి వ్యవహారాలు జరుపుతూ ఉంటే ప్రభుత్వము కొద్దిగా చర్య తీసుకొంటుంది.

Sri VAVILALA GOPALA KRISHNAIAH :- ఇప్పుడు మీరు Accounts తయారైన గ్రామాలకు జమాబంది జరిపాము అన్నారు. ఎన్ని గ్రామాలకు జరిగింది? ఎన్ని గ్రామాలకు మినహాయింపు చేశారు?

The Hon. Sri K. CHANDRAMOULI :- వేరే ప్రశ్న వేయండి

*State Khadi and Village Industries Board in the State.*

65—

* 18 Q--Sri N. C. SESHADRI:- Will the Hon. the Minister for Planning and Indusries be pleased to state-

(a) whether the State Khadi and Village Industries Board is functioning in the State now:

(b) if so, who are the members serving on the board and their functions;

(c) whether this Government has any plan for giving an impetus to the Khadi Industry during the second plan period; and

13th August 1956)

(d) if so, the details of the proposed improvement in this sector ?

The Hon. Sri K. VENKATA RAO:--

(a) Yes, Sir.

(b) A list (vide appendix printed at page 237 infar) of members on the Board is placed on the table of the House. The function of the Board is to advise the Government on measures to be taken for the development of Khadi and other village industries.

(c) The State Government have since transferred their activities in regard to the development of the Khadi industry to the All India Khadi and Village Industries Board and they are, therefore, not considering now any proposals for giving impetus to the khadi industry under the Second Five Year Plan.

(d) Does not arise.

(a) అవును

(b) Board Members యొక్క list ఇప్పుడు Table మీద పెట్టడ మైంది. ఖాదీ ప్రోత్సహంకోసం, గ్రామ పరిశ్రమల ప్రోత్సాహం కోసం చేయదలచు కొన్నటువంటి చర్యలు గురించి ప్రభుత్వానికి సలహా ఇవ్వడం ఈ బోర్డు యొక్క ధర్మము.

(c) ఈ ఖాదీ Industries కు సంబంధించి నటువంటి వ్యవహారాలన్నింటినీ All India Khadai Village Industries Board వారికి ఇదివరకే అప్ప చెప్పడం అయింది. వారు ఖాదీ Industries ను రెండవ పంచవర్ష ప్రణాళికలో చాలాముందుకు తీసుకుపోయేటటువంటి యత్నాలు చేస్తున్నారు.

(d) లేవదంటి.

Sri S. VEMAYYA:- ఇక్కడ ఉన్నటువంటి list లో non-official members కూడా ఉన్నట్లు కనడుతున్నది. ఈ non-official members ను ఏ ప్రాతిపదిక మీద వేశారో తెలుసు కోవచ్చునా ?

The Hon. Sri K. VENKATA RAO:-గవర్నమెంటు వారి చిత్తాన్ని అనుసరించి వేశారు.

Sri E. AYYAPU REDDI:-అంబర్ చర్కావల్ల ఖాదీ పరిశ్రమ దెబ్బ తింటుందని, అంబర్ చర్కాతీసుకు వస్తే ఖాదీ పరిశ్రమకు అవకాశంలేదని కొంత

మంది నిపుణులు తమ అభిప్రాయాలు పత్రికలలో వెల్లడించారు. వానిపైన ఈ ప్రభుత్వము యొక్క దృక్పథమేమిటో తెలియజేస్తారా

The Hon Sri K. VENKATA RAO:-- అంబర్ చర్కాలను దేశమంతటా ప్రవేశపెట్టాలని.

Sri T. JIYYAR DASS:- ఈ బోర్డు పరిశీలన చేసేటటువంటి పరిశ్రమలలో తోళ్ళ పరిశ్రమ ప్రధానమైనది కదా. కనుక ఈ తోళ్ల పరిశ్రమ జాతికి చెందినటువంటివారిని ఎవరినైనా ఇందులో వేశారా ?

The Hon Sri K. VENKATA RAO:- ఇది తోళ్ల పరిశ్రమను సంబంధించి నటువంటిది కాదు. ఖాదీ పరిశ్రమను సంబంధించినది.

Sri V. VISWESARA RAO:-- మంత్రిగారు సెలవిస్తూ Second Five year planలో కేంద్రప్రభుత్వమే ఈ ఖాదీ పరిశ్రమనుగురించి కూడా చేస్తుంటుందని చెప్పుతున్నారు. అటువంటప్పుడు మన రాష్ట్రములో దీనికి advise ఇవ్వవలసిన అవసరమేమి ఉన్నది?

The Hon. Sri K. VENKATA RAO:-- మన రాష్ట్ర బోర్డు ఒక్క ఖాదీనే గురించి కాదు ఉన్నది. ఇక్కడ village industries ను గురించి కూడా advise ఇస్తూ ఉండవచ్చు. మీరు వేసిన ప్రశ్నకు సమాధానము చెప్పగలను గాని, మీ మనస్సులో ఉండే దానికి చెప్పలేను. వారేమో ఖాదీ Industries Board లో ఎవరున్నారని, impetus to khadi industries అని ప్రశ్న అయినప్పుడు. దీని లోకి తోళ్ల పరిశ్రమ తీసుకొని వస్తే వీలులేదని చెప్పాను. కాని ఇది కలిపినాము. మీరు మళ్లీ ఆ ప్రశ్న చదువుకోండి.

Sri E. AYYAPU REDDI:- అంబరు చర్కా దేశమంతటా ప్రవేశపెట్టాలని మంత్రిగారు అంటున్నారు. ఆవిధంగా చేస్తే యిప్పుడు ఉన్న ఖాదీ పరిశ్రమలో ఏమైనా మార్పువస్తుందా? ఒక వేళ ఏమైనా మార్పువస్తే, ఆమార్పుల యొక్క ఫలితముఏమి ?

The Hon Sri K. VENKATA RAO:-Governmant of India వారు కార్మిక కమిటీని వేయడమే కాకుండా Industries Ministirs Conference departmental గా జరిపి యీవిషయము అంతా చర్చించి, అమలు జరిపే సంవత్సరములో 75 వేల అంబర్ చర్కాలను దేశములో ప్రవేశపెట్టటానికి నిర్ణయించారు. అందులో పదివేల చర్కాలు ముఖ్యంగా ఆంధ్రదేశములో ప్రవేశపెట్టటానికి నిర్ణయము జరిగింది. ఇది అంతాజరిగి, కొంతకాలమయేటప్పటికి వాటి ఫలితాలు ఎట్లా ఉంటాయో అప్పుడు తెలుస్తాయి.

13th Aueust 1956)

Sri R. B. RAMAKRISHNA RAJU:- ఈమధ్య కొన్ని మాసాల క్రిందట మన ప్రభుత్వంవారు కూడ అంబర్ చర్కాలను ప్రవేశ పెట్టబోతారని పేపర్లలో చూచాను. దాన్నిగురించి ప్రభుత్వంవారు ఎక్కడెక్కడ ప్రవేశ పెట్టాలని నిర్ణయించారు ?

Sri Hon. Sri K. VENKATA RAO:- ఈ కార్యక్రమమంతా మన రాష్ట్రములో జరపడానికి All India Village khadi Industries Board వారు చూస్తున్నారు. వారు Government of India వారిని సంప్రదించే చేస్తున్నారు ఇంతవరకు ఉన్న centres గాకుండా, యింకా 36 centres క్రొత్తగా పెట్టటానికి వారు నిర్ణయించినట్లు తెలుస్తున్నది. ఈ పదివేల చర్కాలు ప్రవేశపెట్టి పని జరిపించ గలిగితే చాలా సంతోషమే.

Sri T. JIYYAR DASS:- Khadi and Village Industries Board అని అంటే, తోళ్ళ పరిశ్రమకూడ దీనిక్రిందనే వస్తుందని. బహుశ కేంద్ర ప్రభుత్వం వారు యిటీవల తోళ్ళ పరిశ్రమకు సంబంధించిన Leather Board అనేది వేరే పెట్టటానికి నిర్ణయించారు. బహుశ ఆంధ్రప్రభుత్వము కూడ అదే నిర్ణయానికి వస్తే, తోళ్ళ పరిశ్రమకు సంబంధించి వేరే బోర్డును యిక్కడ కూడ ఏర్పాటు చేస్తారా ? అది లేని పక్షములో తోళ్ళ పరిశ్రమకుగాను ఏ ప్రతినిధి నైనా వేయటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. VENKATA RAO:— ఈ ప్రశ్న ప్రత్యేకంగా ఉన్న C క్లాజు చూచుకోవలసి యున్నది. బోర్డులో మెంబర్లు లేరని అడిగారు గాని అసలు మూడవ ప్రశ్నచూస్తే, "Whether the Government has ane Plan for giving impetus to the Khadi Industry during the Scond Plan Period." అని వున్నది. దీనిని గురించి ప్రశ్నలు, సమాధానములు, యివ్వడం జరుగుతూంటే, యిందులోకి తోళ్ళను తీసుకొని వస్తే ఎట్లా అని అంటున్నాను. Khadi కి సంబంధించింది యీ ప్రశ్న. గాని తోళ్ళకు సంబంధము లేదు.

Sri G. YELLAMANDA REDDI:- అధ్యక్షా, ఈ ఖాదీ సెంటర్లలో deposits యిస్తేనే గాని weaversకు యివ్వడము లేదు. అందువల్ల వారికి చాలా యిబ్బందిగా ఉన్నది. ఆ రూలును తగ్గించటానికి గాని, లేకపోతే మినహాయింపు చేయటానికి గాని ప్రభుత్వం ఆలోచిస్తుందా ? అక్కడక్కడ ఏదో ఒక

పోగు తెగిందన్నట్లు. examine చేసినట్లు చేసి, వారికి పెద్ద పెద్ద Penalties విధిస్తున్నారు. అది తక్కువగా ఉండటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

The Hon. Sri K. VENKATA RAO:- ఎవరైనా పని చేసేటప్పుడు, ఆపని శుభ్రముగా చేయాలి. గాని, పని శుభ్రముగా చేయని వారికి Penalties వేయక తప్పదు. ఒక పోగు తెగిపోయినా, Penalties వేయబడ్డని అంటే, యల్లమందా రెడ్డిగారికి ఖాదీమీద అంత అభిమానము ఎప్పుడు కలిగిందో తెలియకుండా ఉన్నది. వారికి అంత అభిమానము ఉన్నదని తెలియడానికైనా, వారి శరీరముమీద ఒక్క ఖాదీపోగు అయినా కన్పించదాయను. Penalties వేస్తున్నారంటే, అందులో అన్యాయము జరిగి ఉండదు. అందులో experts ఉన్నారు. వారు All India Khadi Industriesలో పని చేసేవారు. అందులో వారి జీవితమంతా ధారపోసిన వారు కాబట్టి, అందులో న్యాయాన్యాయాలు తెలుసు. అంతే కాని Penalties వేస్తున్నారని బాధ పడితే ప్రయోజనము లేదు. ఎవరైనా penalties వేసి బాధపెట్టుదామనే మనస్సుతోను, యత్నంతోను చేయరు. అందువల్ల penalties ఎంత వేస్తున్నారు అనేది, weavers చేసినపనితనముమీద ఆధారపడి ఉంటుంది. ఇకడిపాజిట్లు అడుగుతున్నారంటే, వారు అంత పెట్టుబడి పెట్టినప్పుడు, వారు ఆమాత్రం అడగకపోతే, అవిరావు. పనులుకావు.

### *Construction of Light houses in the State.*

66—

* 118 Q--Sri P. GOPALAKISHNA REDDI :- Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state-

(a) whether the Government have received any proposals from Central Government for construction of light houses in this State and

(b) if so, the estimated cost thereof and their location?

The Hon. Sri G. LATCHANNA:--

(a) The answer is in the negative.

(b) Does not arise.

(ఎ) అటువంటి proposals ఏవీరాలేదు.

(బి) దానికి అవకాశము లేదు.

Sri K. APPA RAO:-- ఈ మధ్య మన ముఖ్య మంత్రి గారు కొల్లేరులో దారి తప్పిపోయారు. అందువల్ల అలాంటిది జరగకుండా అటు ఏలూరు వద్ద, ఇటు కైకలూరు వద్ద రెండు lighthouses కట్టించే ఏర్పాటు చేయిస్తారా?

13th August 1956)

The Hon. Sri G. LATCHANNA:--ప్రస్తుతము ఇక్కడ ఒక light-house కట్టే ఏర్పాటు చేస్తున్నారు.

Sri M. NAGI REDDI:-- ఇప్పుడు కట్టేటటువంటి ఇళ్లకంటె చౌకగా కొన్నియిళ్లు, అంటే రాయితోటి, గచ్చు, వగైరాలు కాకుండా ఎక్కువమందికి చౌక వారు యిళ్లుకట్టించడానికి కేంద్ర ప్రభుత్వమునకు ఒక సంకల్పము, plan ఉన్నట్లు పత్రికలలో పడింది, అందువల్ల యికముందైనా కార్మికులకు, వ్యవసాయ కూలీలకు కట్టబోయే యిళ్లు చౌకగా కట్టించడానికి ప్రభుత్వానికి ఉద్దేశ్యము ఉన్నదా?

The Hon. Sri G. LATCHANNA:-- ఈ ప్రశ్న lighthouses ను గురించి.

Sri S. VEMAYYA:-- కేంద్ర ప్రభుత్వంనుంచి lighthouses ను కట్టించటానికి ఏలాంటి ఆదేశాలుగాని,సలహాలుగానిరాలేదని మంత్రిగారు చెబుతున్నారే, అలాంటప్పుడు మన రాష్ట్ర ప్రభుత్వంనుంచి అయినా proposals పంపించారా?

The Hon. Sri G. LATCHANNA:-- మన రాష్ట్ర ప్రభుత్వం పంపించిన proposals ను గురించి కొంతవరకు కొన్ని schemes approve అయి వచ్చినవి. ఆ వివరాలను గురించిన లిస్టు తప్ప మిగతావాటికి నావద్ద యిప్పుడు లేదు. మిగతా స్కీములు approval కూడా కావాలని యిటీవలనే మన ప్రభుత్వం అక్కడి అధికారులను రప్పించి చర్చించడంచి జరిగింది. వాటిని గురించిన చర్చలు యీరోజున జరగ బోతున్నవి.

*Houses constructed under the Scheme for low income group.*

**67—**

133Q Sri S. VEMAYYA; Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the number of houses constructed in the State during the year ending 31st March 1956 under the scheme of construction of houses for low income group

The Hon. Sri D. SANJIVAYYA;-

7 houses by private parties and 13 houses by Bapatla Municipality

Sri S. VEMAYYA:- ఈ స్కీమును రాష్ట్రవ్యాప్తంగా అభివృద్ధి చేయటానికి ప్రభుత్వం ఏఏ చర్యలు తీసుకుంటున్నది?

(13th August 1956

The Hon. Sri D. SANJIVAYYA:- అన్ని వర్గాలు కూడా.

Sri P. RAJAGOPL NAIDU:- మంత్రిగారు మన State కోసము కట్టిన ఇండ్లసంఖ్య చాలా తక్కువగా ఉన్నది దీనికి కారణము వారి డిపార్టుమెంటులోని Delay వల్లనా నాకు తెలిసినంతవరకు ప్లాన్సు అన్నీ Pending గా ఉన్న వని, డిపార్టుమెంటు వారు ఎవరూకూడ పని చేయడము లేదని తెలుస్తున్నది. నిజమేనా?

The Hon Sri D. SANJIVAYYA:- 466 applicationsకు గ్రాంట్లు యిచ్చాము కొంత పోయిన సెప్టెంబరులో కేంద్ర ప్రభుత్వం నుంచి వచ్చింది. తరువాత మార్చిలోగా అని అన్నారు. ప్రస్తుతము May end కు 90 ఇళ్ళు Roof level కు వచ్చినవి. 172 Clink level కు వచ్చినవి. వీటి అన్నింటికీ Government of India వారు యీ September ఆఖరు వరకూ Time యిచ్చారు. మొత్తము మీద September లోగా అన్నీకూడ పూర్తి అవుతాయి.

Sri T. GOPALAKRISHNAYYA GUPTA;- Low income Group Housing scheme క్రింద యిళ్ళు అన్ని రెండు సంవత్సరాల లోపల పూర్తి కావాలని తీర్మానం చేయవలసిందని అన్నారు. తరువాత ఒక సంవత్సరమే అని అన్నారు. ఇప్పుడు ఒక మార్పు తీసుకుని వచ్చారు. అలాంటప్పుడు యీ యిళ్ళు అన్నీ జాగ్రత్తగానూ, సుభ్రముగానూ కట్టటానికి అవకాశము ఉండదనే విషయము ప్రభుత్వానికి తెలుసునా? తెలిసిఉంటే, యీ వాయిదాను ఒక సంవత్సరము కాకుండా, రెండు సంవత్సరముల వరకూ పొడిగించటానికి కేంద్ర ప్రభుత్వానికి వ్రాసి, వారి అనుమతి తెప్పించటానికి ప్రభుత్వం ప్రయిత్నిస్తుందా?

The Hon. Sri D, SANJIVAYYA:- ఒక్క సంవత్సరము చాలు ననుకుంటాను. ఒక్క సంవత్సరములోగా యిళ్ళను బాగానే కట్టవచ్చును. కాబట్టి కేంద్ర ప్రభుత్వానికి వ్రాయనవసరముండదు.

Sri P. RAJAGOPAL NAIDU :- ఈ యిళ్ళ నిర్మాణానికి కావలసిన సిమెంటు దొరకడము లేదని Complaint ఉన్నది అందుకు ప్రభుత్వం ప్రత్యేక ఏర్పాటు ఏదైనా చేస్తుందా?

The Hon. Sri D. SANJIVAYYA :- అసలు ప్రభుత్వము కట్టించే యిళ్ళకే సిమెంటు చిక్కడము లేదు. అందువల్ల Housing Societies కు సిమెంటు సప్లయి చేయడానికి అవకాశమే లేదు.

(13th August 1956

Sri. B. APPA RAO :- సుమారు నాల్గు వందల applications వచ్చాయని మంత్రిగారు చెబుతున్నారు. అయితే ఏఏ మునిసిపాలిటీల నుంచి, ఏఏ ప్రాంతాలనుంచి వచ్చినవో చెబుతారా?

The Hon. Sri D. SANJIVAYYA :- అది చాలా పెద్ద జాబితాలో ఉన్నది. అది అంతా యిప్పుడు చదువవలెనంటే టైము చాలా తీసుకుంటుంది. అధ్యక్షులవారు చదువమని అంటే, నాకు అభ్యంతరము లేదు.

Mr.SPEAKER:-It need not be read out if it is such a long list

Sri A. SATYANARYANA MURTHI :- అధ్యక్షా ఈ Housing Scheme విషయములో ప్రభుత్వం డబ్బుయిస్తామని proposals తీసుకుని, తరువాత అవి సగము వరకు కట్టిన తరువాత, డబ్బు యివ్వలేదు, అందువల్ల వారు చాలా యిబ్బంది పడుతున్నారు. ప్రభుత్వం ఆ విధముగా చేయటానికి కారణమేమి?

The Hon. Sri D. SANJIVAYYA :- అటువంటివి ఏవైనా ప్రభుత్వ దృష్టికి తీసుకుని వస్తే, తగిన చర్య తీసుకుంటుంది.

Sri N. K. LINGAM:- ఈ కోఆపరేటివ్ సంస్థల ద్వారా కట్టించే యిళ్లు సర్వసాధారణముగా అన్నీ కూడా కట్టిన ఆరు మాసాల లోనే కూలిపోతున్నవి. అట్లాంటప్పుడు మునిసిపాలటీ వారు కట్టించిన యిళ్లు ఎన్ని రోజులలో కూలిపోతాయో మంత్రి గారికి తెలుసునా?

The Hon. Sri D. SANJIVAYYA:-ఎన్ని కూలిపోతాయో వాటియొక్క లెక్కలు తెచ్చి చూపిస్తే, ఎక్కడెక్కడ పడిపోయినవో అవిఅన్నీ ప్రభుత్వం దృష్టికి తెస్తే, యిక ముందు ఎన్ని కూలిపడి పోతాయో అంచనా వేసి చెబుతాను.

Sri S. VEMAYYA:-మంత్రిగారు జవాబు చెబుతూ ప్రైవేటు యిళ్లకు మాత్రమే యిచ్చామని అన్నారు. పైగా అవి అన్నీ కూడ complete అయినవని అన్నారు. ఈ మాదిరి ప్రైవేటు యిళ్లకు యిచ్చే విషయములో ఏఏ conditions మీద ఆ private individuls కు యిచ్చారో చెబుతారా?

The Hon. Sri D. SANJIVAYYA:- Low income groupe housing schemeక్రింద కొంత యిచ్చిందని detailsతో సహా చెప్పాను. ఇంకను కావాలంటే, ఆ స్కీము యొక్క conditions కాని, లేకపోతే దానికి సంబంధించిన షరతులు కాని ఒక pamphlet రూపములో యివ్వమంటే యిస్తాను.

(13th August 1956

Mr. SPEAKER Mr. Lingam is confounding between the low income group housing scheme and the house building societies.

SriVAVILALA GOPALAKRISHNAYYA:-సిమెంటుగవర్న మెంటుకే దొరకటం లేదంటున్నారు. ఫ్యాక్టరీలకు వారి ఇష్టం వచ్చినట్లు అమ్ము కునండని ఆర్డర్లు ఇచ్చారు. వారి ఇష్టము వచ్చినట్లు అమ్ముచున్నారు.

The Hon. Sri K. VENKATA RAO:- పొరపాటువ డ క ం డి. దేశములో తయారు అయిన సిమెంటు ఈనాడు దేశాభ్యుదయ కార్య క్రమములకు సరిపోదు. రెండు సంవత్సరాల క్రితము దేశములో తయారయిన సిమెంటు ఇతర దేశాలకు పంపేవారము. ఇపుడు గవర్నమెంటు ఖర్చు ఒకేమారు రావడము వల్ల సరిపోవడము లేదు. అందుకోసము గవర్నమెంటు ఆఫ్ ఇండియా వారు 6 లక్షల టన్నుల సిమెంటు దిగుమతి చేస్తున్నారు. అక్టోబరు నుంచి కావలసినంత సిమెంటు దొరుకుతుంది, గోపాలక్రిష్ణయ్య గారు ఇల్లు వాకిలి కట్టవలచుకొన్నా.

*Scheme of Shri N. Venkataiah regarding neera.*

**68—**

105 Q.-- Sri S.VEMAYYA:- Will the Hon.the Minister for Local Administration and Prohibition be pleased to state-

(a) whether this Government have taken a decision to implement the scheme of Sri N. Venkataiah regarding neera and

(b) if so, when it will come into force?

The Hon. Sri A. B. NAGESWARA RAO

(a) :- Not yet, Sir.

(b) :- Does not arise

Sri S. VEMAYYA - ఈ స్కీముకు సంబంధించిన దస్తరం విప్పకుండా ఉండడానికి కారణం ఏమిటండి?

The Hon. Sri A. B. NAGESWARA RAO దస్తరం విప్పి చాలా కాలం అయింది.ఈ స్కీము ఇనాగరేషను 29-4-56న పుయ్యూరు ఫ్యాక్టరీలో start చెయ్యబడింది. తగినంత నీరా దొరకక పోవడం చేత ఆ experiment ఆపివేయ బడింది. తిరిగి డిశంబరులో ప్రారంభిస్తారని వెంకటయ్య గారు వ్రాసినారు. ఎప్పుడు దొరికితే అప్పుడు మళ్ళి ప్రారంభించి మళ్ళి ఫైనలు ఎక్స్పెరిమెంట్లు అయిన తరువాత decisionతీసుకో బడుతుంది.

Sri R. B. RAMAKRISHNARAJU:- ఈ స్కీము ఏ స్థితిలో ఒక pamphlet ద్వారా తెలియ చేస్తారా?

The Hon. Sri A.B. NAGESWARA RAO:-తరువాత ఆలోచిస్తాము.

Sri P. SATYANARAYANA RAJU :- వుయ్యూరులో నీరాతో ఎన్ని రోజులు పనిచేసినారు? నీరానుంచి పంచదార వచ్చిందా? Working details ఇవ్వగలరా?

The Hon. Sri A. B. NAGESWARA RAO:- Sugar వస్తున్నది. ప్రత్యేక ప్రశ్నవేస్తే వివరములు చెప్పగలను.

Sri G. YELLAMANDA REDDI:- నీరా లేదని మంత్రిగారు చెప్పుతున్నారు. నీరా కోసం అప్లికేషన్లు పెట్టుకున్న సొసైటీలకు ప్రభుత్వం ఎందుకు పర్మిషను ఇవ్వలేదో తెలియ చేస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:- ఇది వెంకటయ్యగారి స్కీమును గురించి. వేరే ప్రశ్న వెయ్యండి.

Sri P. NARASIMHAPPA RAO:- వుయ్యూరు ఫ్యాక్టరీలో నీరా స్కీములో తయారైనది తెల్ల పంచదారా ? నల్ల పంచదారా ?

The Hon. Sri K. VENKATA RAO:-1st Class అయిన తెల్ల పంచదార.

The Hon. Sri A. B. NAGESWARA RAO:- తెల్ల పంచదారగా మారుతుంది.

Sri P. GUNNAYYA:- అధ్యక్షా, ఈ నీరా సొసైటీలు చాలామట్టుకు పెరిగినవి. మనము హైదరాబాదుకు వెళ్ళక ముందైనా మద్రాసులో మాదిరిగా అసెంబ్లీ హాలుదగ్గిర నీరా సొసైటీ పెట్టిస్తారా ? ఇప్పుడు త్రాగుడు చాలా జాస్తీ అగుతున్నది. అది అరికట్టడానికి శ్రీ వెంకటయ్యగారి స్కీము అమలు చేయించాలని అధ్యక్షులవారికి మనవి చేస్తున్నాను.

(No Answer.)

*Stock of ammonium sulphate with Government.*

* 144 Q.—SRI VISWESWARA RAO: Will the Hon. the Minister for Agriculture be pleased to state—

(a) the present stock of ammonium sulphate with this Government; and

(b) the quantity that is indented for the coming season?

(13th August 1956

The Hon. Sri K. OBULA REDDI:-

(a) The stock of Ammonium sulphate held with the distribution agencies as on 6-6-1956 was 38,807 tons.

(b) From the beginning of the calendar year upto 6-6-56 indents had been placed for 63,410 tons out of which 47,245 tons had already been received. The balance is expected to be received before the end of June. Indents for an additional 31,620 tons will be placed before the end of the year.

63,4/0 టన్నులు ఇంకా నిలువలో ఉన్నది. 31, 620 టన్నులు ఇండెంటు చెయ్యబోతున్నాము.

Sri S. VEMAYYA:- ఈ ఎరువులు రావడములో చాలా ఆలస్యము అగుచున్నది. Seasonal గా దొరకడం లేదు. అటువంటింది జరుగకుండా ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకుంటుందా ?

The Hon. Sri K. OBULA REDDI:- అలాంటి ఆలస్యము ఏమీ జరగడము లేదు.

*Earthen road in Tiruvuru N.E.S. and Nuzvid Community Development Blocks.*

71—

* 158 Q.—SRI V. VISWESWARA RAO: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the mileage of earthen road formed in Tiruvuru National Extension Service and Nuzvid Community Development Blocks?

The Hon. Sri K. VENKATA RAO:-

| Tiruvur | Nuzvid |
|---|---|
| 86 M - 5F | 70 M - 7F |

upto end of April 1956

తిరువూరులో 185 మైళ్ళు 5 ఫర్లాంగులు నూజివీడు 77 మైళ్ళు 7 ఫర్లాంగులు 'up to end of April 1956.'

Sri V. VISVESWARA RAO:-అధ్యక్షా, ఈ రోడ్లు అన్నీ సక్రమముగా లేవు. వేసినవి ఎక్కడో తెలియడము లేదు. ఈ మధ్యనే గవర్నరు గారి అధ్యక్షతను జరిగిన Block Officers meeting లోచెప్పినట్లు పత్రికలలో పడ్డది. అది ఎంత వరకు యదార్థము ?

The Hon Sri K. VENKATA RAO:- నేను ఆ మీటింగులో లేను, దానిని గురించి రిపోర్టు నావద్దకూడా లేదు.

13th August 1956)

Sri. M.NAGIREDDI:- ఈ N. E. S. Block లలో వేసేమట్టి రోడ్లకు, ప్రభుత్వం 50% contribution ఇవ్వవలెను అనే నిబంధన లేదా? ఎందుకు గవర్నమెంటు contribution ఇవ్వడము లేదు?

The Hon.Sri K.VENKAT RAO:–ఈ N.E.S. Block లలో గ్రామస్థులు మట్టి రోడ్లు వేసుకొంటే గవర్నమెంటు వారు మెటలింగు, కల్వర్ట్సు చేస్తున్నారు. ఇది ఎక్కువ శ్రమదానం మీద చేయించి మిగిలినది ప్రభుత్వం చేదామని ఉద్దేశ్యము. దానికి కూడ డబ్బుఇస్తే ఉన్న డబ్బంతా త్వరగా ఖర్చు అయిపోతుంది.

Sri E. NAGAYYA:- అధ్యక్షా ఈ స్కీము ద్వారా వేయించే రోడ్లు District Board Roads లాగ కలిసి పోతాయా, లేకపోతే వీటికి maintenance కు ఏమైనా provision ఉన్నదా?

The Hon.Sri K. VENKATARAO:- ఆరు నెలలు వెళ్ళిన తరువాత దొంగజాడ కట్టినట్లు ఈ రోజున N.E.S స్కీముల గురించి ప్రశ్నవేస్తే ఎలాగ? N.E.S Scheme లో తయారయిన ప్రతి విషయాన్ని గురించి దానికి సంబధించిన డిపార్టుమెంటు తరువాత maintain చెయ్యవలెను అనే condition మీద మొత్తం ప్లాను అంతా నడుస్తున్నది.

Sri V.VISWESWARA RAO :- గ్రామస్థులు మట్టిరోడ్డు వేస్తే దానికి కావలసిన కల్వర్ట్సు. మెటలింగు N.E S Block తరపున చేస్తామన్నారు. ఎన్ని మైళ్ల మట్టి రోడ్డు వేసిన మెటలింగు జరగ లేదని మంత్రిగారికి తెలుసునా?

The Hon.Sri K.VENKATA RAO:_ దీనిలో బాధ్యత. విశ్వేశ్వరరావు గారికి కూడ ఉన్నది. వారు శ్రద్ధ తీసుకొని పని చేయించ వలెనని కోరుచున్నాను. జరుగక పోతే Complaintచెయ్యవచ్చును.

Sri B. APPARAO :- N. E. S Blocks లలో మట్టి రోడ్డుల విషయములో ప్రభుత్వం వారి స్కీమును అనుసరించి వేసవి కాలంలోనే రోడ్లు పూర్తి చేసుకుందామని మా నియోజకవర్గంలో ఏన్నో గ్రామాల్లో ప్రభుత్వం metal చేస్తారని పూర్తి చెయ్యలేదు. వేసవికాలం వచ్చేసరికి ఆ రోడ్లు పోయినవి. దానివల్ల ప్రజలలో ఉత్సాహము తగ్గిపోతున్నది, కాబట్టి ప్రభుత్వం ఈ పనులు త్వరగా చేయించడానికి పూనుకొంటుందా?

The Hon Sri K.VENKATA RAO :- అప్పారావు గారు చూసిన ప్రదేశాలలో అలాంటి వ్యవస్థలలో ఉన్నవేమో గాని నేను ఈ మధ్య చూచిన ప్రతిచోటా ఉత్సాహం ఎక్కువ అగుచున్నది. ప్రజలు అడిగిన డిమాండు ఇవ్వలే

కుండా ఉండే పరిస్థితుల లోకి ప్రభుత్వం వస్తున్నది. ఇటువంటి అభిప్రాయం అప్పా రావుగారికి ఎందుకు కల్గిందో నాకు అర్థంకావడంలేదు.

రెండవ విషయము వానవల్ల దెబ్బ తినని రోడ్డు మీద మెటలు వేస్తే దేముడు దగ్గరకు పోతుంది. పట్నాలలోఉన్న అప్పారావుగారికి మెటలు సంగతి తెలియడములేదు?

## *Grants to newspapers for propagating the removal of untowchability.*

72—

238 Q Sri P SATYANARAYANA:- Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether the Government have sanctioned any grants to any newspapers during the years 1955-56 and 1956-57 for carrying propaganda for the removal of untouchability! and

(b) if so, the amount sanctioned in each year and the names of those nespapers?

The Hon. Sri G. LATCHANNA:-

(a) The answer is in the negative.

(b) Does not arise.

a) అటువంటి గ్రాంటు ఇవ్వబడలేదు.

b) ప్రశ్నకు అవకాశములేదు.

Sri S. VEMAYYA :- కేంద్రప్రభుత్వం నుంచి ఎలాంటి సబ్సిడీ ఇవ్వకపోయినా అస్పృశ్యతా నివారణ సందర్భములో ఏబాపతు క్రిందయినాడబ్బు ఇచ్చిందా? ఇస్తేదానిని ఏవిధముగా వినియోగించారు?

The Hon. Sri G. LATCHANNA:- ప్రత్యేక పేపర్సు మీద వేసిన ప్రశ్న. ఈ ప్రశ్నలో 1955-56, 1956-57లో గ్రాంటు ఇవ్వబడిందా అని అడిగినారు. 1954,55 లో కేంద్ర ప్రభుత్వం సర్వోదయకు రు.500-లు ఇచ్చింది. దరిమిలా అటువంటి గ్రాంట్సు ఇవ్వలేదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:- అశ్పృశ్యతా నివారణ మీద ఆక్టువచ్చింది. ప్రచారం జరగడంలేదని సెంట్రలు బోర్డు వారు అడుగుతున్నారు. ప్రభుత్వం ఈ ఆక్టులను తెలుగులో అచ్చు వేయించడానికి ప్రయత్నం చేస్తారా? చాలామందికి ఈ ఆక్టుదొరక నందున వారికి ఉన్న హక్కులు కూడా వారికి తెలియవు.

The Hon. Sri G. LATCHANNA:- వేరే ప్రశ్న వెయ్యండి.

13th August 1956)

*Appointment of peons under Veterinary Livestock Inspectors*

**73**

* 219 Q-Sri M. RAJA RAM :- Will the Hon. the Minister for Agriculture be pleased to state--

(a) whether any peons are appointed under Veterinary Livestock Inspectors in Animal Husbandry Department; and

(b) if not, why not?

The Hon. Sri K. OBULA REDDI :--

(a) & (b)

Veterinary Livestock Inspectors are not generally independent officers requiring the assistance of peons. They are however provided with peons, whenever necessary for efficient discharge of their duties.

Live Stock Inspectors కు ప్రత్యేకముగా ఇవ్వడము లేదు. అయితే ఎప్పుడైనా ప్రత్యేకంగా భారము అయిన పనులు వారిమీద పెట్టబడినపుడు అడపా తడపా Peons ఇవ్వడము అనేది జరుగుతుంది.

*Protected water-supply to villages.*

**75**---

* 173 Q-Sri V. VISWESWARA RAO :- Will the Hon. the Minister for Planning and Industries be pleased to state--

(a) whether there are any proposals to provide protected water-supply to villages, besides the formation of Rural Protected Water Supply Centres; and

(b) if so, what are they?

The Hon. Sri K. VENKATA RAO:-

(a) The answer is in the negative.

(b) Does not arise.

a) లేదండి.

b) ఉత్పన్నించదండి,

Sri V. VISWASWARA RAO:- మంత్రిగారు ఉత్పన్నించదని చెప్పారు. గాని అక్కడి సమస్య ఏమిటంటే Rural water supply scheme విషయములో కొన్నిచోట్ల బావులు తీసినా మంచినీరు పడడంలేదు. చెరువులు తవ్వించాల్సిన అవసరంఉన్నది. చెరువులు తవ్వించడానికి వీలు లేదంటున్నారు. మంచి నీరు లేక బాధపడు చున్నారు. అందుచేత ప్రత్యేకించి N. E. S. Blocks అలో చెరువులు త్రవ్వించడానికి permission ఇస్తారా?

(13th August 1956

The Hon. Sri K. VENKATA RAO :— బావులు త్రవ్వడానికి పర్మి షను ఇస్తాము. దానిని గురించి sanction ఇవ్వడానికి తగిన డబ్బు schematic Budget లో లేదు.

Sri V. VISWASWARA RAO:— కొన్ని ప్రాంతాలలో భావి త్రవ్వ డానికి ఎంత అవుతుందో చెరువు త్రవ్వించడానికీ అంతే అగుతుంది, రైతులు సహ కిరించితే ప్రత్యేకించి వారికి మంచినీరు supply కి కోనేర్లు ఏమైనా ఏర్పాటు చేస్తారా?

The Hon. Sri K. VENKATA RAO :— Schematic Budget ఇండియా అంతకు ఉంది. దాని ప్రకారం వెళుతుంది. చెరువులు తవ్వించడానికి వెరేస్కీములు ఉన్నవి. మంచి నీటిసప్లైకిఇంకా స్కీములు ఉన్నాయి. N.W.R S అది కాకుండా ఇంతవరకు R.W.S. స్కీములు, మిగిలిన చెరువులు పూర్తి చెయ్య డానికి యత్నంచేస్తున్నారు. ఇదికాకుండా ప్రత్యేకమైన grant ఇప్పించాలని ఇండియా గవర్నమెంటును కోరినారు. L. D. Works క్రింద ప్రత్యేకము గ్రామా లలో మంచినీటి సప్లైకొరకు కోరడమైనది.

ri B. SANKARAIAH:— మంచినీళ్లు ప్రాణాధారమైనవి కాబట్టి పంచాయితీ బోర్డులు సగముఖర్చు పెటుకుంటామనే చోట్లలోనైనా త్వరగా sanction చేసి యీగ్రామాలకు నీటిసప్లై త్వరగా యిచ్చేదానికి చూస్తారా?

The Hon. Sri K. VENKATA RAO:— శంకరయ్య గారు ఇంకొక ప్రశ్నవేశారు. డబ్బు యివ్వనున్న వారికి త్రవ్వి, మిగిలిన వారికి మానివేస్తారని అన్నారు. ఎక్కడ అవసరముందో అక్కడ చేయించడానికి ప్రభుత్వానికి అభ్యంతరము లేదు.

*Introduction of compartmental system in S.S.L.C. class.*
136---

* 288 Q- Sri VAVILALA GOPALAKRISHNAYYA:- Will the Hon. the Chief Minister be pleased to state:

when the Government will introduce the compartmental system in S. S. L. C. namely passing the examination in parts?

The Hon. Dr. B. GOPALAREDDI:-

The question of introducing compartmental system in S. S. L. C. is still under consideration and is incorrespondence with the University.

13th August 1956)

Sri VAVILALA GOPALA KRISHNAYYA :- Correspondence త్వరగా చేసేటట్లు ఏర్పాటు చేయగలరా? లేకపోతేమళ్ళీ Compartmental Schemeను తీసుకొస్తే నేగాని ఉపయోగము లేదని అంతా feel ఔతున్నారు. మంత్రి గారు కూడా ఏలూరులో ఉపన్యాసమిస్తూ Compartmental Scheme చాల అవసరమన్నారు. అది జ్ఞాపకము లేకపోతే Little Flower Company వారు publish చేసిన పుస్తకములో వేశారు కూడాను మంత్రిగారు చెప్పారని, అందుచేత దానికి మీరు పూర్తిశ్రద్ధ వహించి చేయించుతారా?

The Hon. Dr. B. GOPALA REDDI :- నేను ఏ సందర్భములో చెప్పిందికూడా జ్ఞాపకము వుంది. కాని యీ విషయంలో యూనివర్శిటీల ఆమోదము లేకుండా మనమేమి చేయడానికి వీలులేదు. వాండ్లందరూ pass అయిన తరువాత వాండ్లను యూనివర్శిటీలో చేర్చుకోవలసిన బాధ్యత వారిమీద వున్నది. కాబట్టి వారి యొక్క సంపూర్ణమైన ఆమోదము రావాలి. వాండ్లుకూడా బహుశ ఆలోచిస్తారని అనుకుంటాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:_అధ్యక్ష;Matriculationకు సంబంధించి నంతవరకూ యూనివర్శిటీది, S.S.L.Cఏమో గవర్నమెంటు Examination Board చేయవచ్చును. కనుకఅందువల్ల Examination Board వెంటనే ప్రయత్నం చేస్తారా?

The Hon Dr. B. GOPALAREDDI:- S. S. L.C Board లో స్వతంత్రంగా చేస్తే రేపు ప్రొద్దున వారిని Intermediate లో చేర్చుకోరు, కాబట్టి S. S. L. C పరీక్షలో pass చేయడము fail చేయడము అంతాకూడా యూనివర్శిటీ వారే చేస్తున్నారు. Examinations conduct చేసేది S. S. L. C Board. వాస్తవమే. దానిలో pass అయ్యేది fail అయ్యేది ఎవరిని College లో తీసుకొనవలసిందని నిర్ణయించేది యూనివర్శిటీ వారే. అందువల్ల వారి సంబంధము లేకుండా ఏమి చేయడానికి వీలులేదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:- ఇపుడు Moderation Board లేకుండా చేశామన్నారు. దీనిని తీసి పారవేశాము కనుక యీ Rules అన్నీ కూడా ఇదివరకు వున్నటువంటి వాటిని అమలు జరుపు తున్నామని ఏ మైనా Examination Board కు వ్రాశారా? ఇపుడు Moderation Board తీసివేశాము. Ruls regularise చేస్తామని ఒకసారి మంత్రిగారు చెప్పారు, కాని అందుకు Reasons చెప్పమని అడిగితే మీరు యూనివర్శిటీ వాండ్లనే అడగండి అని చెప్పు

4)

తున్నారు. ఇవి ఎవరు చేస్తున్నారో యీ question ఎవరిదో మాకు అర్థం కావడంలేదు.

The Hon. Dr. B. GOPALA REDDI :— ఎందుకు అర్థం కావడం లేదో తెలియడం లేదు. Examinations conduct చేసేది Director of Public Instruction. తర్వాత marks అన్నీకూడా యూనివర్సిటీ వాంళ్లు ఏర్పాటు చేసినటువంటి Moderation Board లో పెట్టుతారు. ఎవరిని pass చేయాలో ఎవరిని fail చేయాలో అనే దానిని నిర్ణయం చేసేది వాండ్లే. D. P. I కి ఏమీ సంబంధములేదు. Moderation Board తీసివేసినామంటే అర్థమేమి టంటే ప్రతిసంవత్సరము యీ Moderation Board కూర్చోకుండా సంవత్సరం సంవత్సరానికి Rules మారుతూ వచ్చినాయి. ఈ సంవత్సరం ఇంగ్లీషులో 35 మార్కులు వస్తే చాలును. 30 మార్కులకు దిగిన సంవత్సరాలు కూడా వున్నాయి. ఈ మాదిరికాకుండా ఇదమిద్ధమైన Moderation Rules Regulation లోనే పెట్టుకుంటే ఆ ప్రకారంగా D. P. I Office లోనే ఎవరు పరీక్ష ఐనారు ఎవరు పరీక్ష కాలేదనే నిర్ణయంవారే చేస్తారనే మాటగా మేము యూనివర్సిటీలతో చెప్పినాము. వారు కూడా అంగీకరించినారు. అందువల్ల Compartmental system విషయం వేరే విషయం.

### *Surcharge on Land Revenue*

137-

89 Q.- SRI VAVILALA GOPALAKRISHNAYYA: Will the Hon. the Minister for Revenue be pleased to state what amount has been so far collected by way of surchage on Land Revenue upto date?

The Hon. Sri K. CHANDRAMOULI:-

An amount of Rs 865-12-0 has been collected as surcharge on Land Revenue upto 14-6-56.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:- ఏ జిల్లాలోనో, ఏతాలూకాలోనో చెప్పగలరా?

The Hon.Sri K, CHANDRAMOULI:- శ్రీకాకుళం జిల్లాలో.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :- ఇతర జిల్లాలలో. వసూలు చేయడం అవసరం లేదనుకున్నారా? లేక ఆ చట్టం అమలు జరుపరా?

13th August 1955)

The Hon Sri K. CHANDHRAMOULI:- ఇప్పుడు పని అంతా సక్రమంగా జరుగుతున్నది. తొందరగా వసూలు కావడానికి శ్రీ గోపాలక్రిష్ణయ్య గారు కూడా తోడ్పడాలని కోరుతున్నాను.

Sri M. NAGIREDDI :- ఇది గత సంవత్సరానికి సంబంధించిన సర్చార్జీ. జూలై ఆఖరుతో ఫసలీ అయిపోయింది. సాధారణంగా లాండు రెవిన్యూ ఫసలీ దాటిన తరువాత కట్టినట్లయితే వడ్డీతో సహా కట్టాలంటారు. కాబట్టి రైతులు సర్చార్జీ మీదకూడా వడ్డీ కట్టవలసి వస్తుందా? అది లేకుండా చేస్తారా?

The Hon. Sri K. CHANDRAMOULI:- సర్చార్జీ మొత్తాలు వసూలు చేస్తారు కాని ఇప్పుడు వడ్డీలు వసూలు చేయరు.

Sri V. VISWESWARA RAO :- అధ్యక్షా ఇప్పుడు సర్చార్జీ లెఖ్ఖలు తయారు చేస్తున్నామని చెప్పుతున్నారు. ఇవి రైతుల దగ్గర డబ్బువుండే రోజులు గావు. కాబట్టి సర్చార్జీ వసూలు చేయడం ఆపుచేసి వచ్చే పంటల కాలంలో వసూలు చేయడానికి ప్రభుత్వం పూనుకుంటూందా?

The Hon.K.CHANDRAMOULI:- ఎక్కడైనా ఇబ్బందులున్న చోట పన్నులు వసూలు చేయడం ఆపుతూనే ఉన్నారు. వాటన్నింటి విషయంలో ప్రభుత్వం తగిన చర్యలు తీసుకుంటున్నది. కాని ఇప్పుడు సర్చార్జీ వసూలు చేయడం ఆపుచేయవలసిన అగత్యమేమీ లేదు.

Sri. VAVILALA GOPALAKRISHNAYYA :- ఈ యాక్టును ఒక సంవత్సరానికి మాత్రమే చేసినారు. అయితే ఈ యాక్టు సజీవంగా వుంటుందనే కారణం చేతనే డిమాండ్సు ఇవ్వలేదు. యాక్టు లేకుండా డిమాండ్సు ఇచ్చినట్లయితే రైతులు కోర్టుకు వెళ్ళడానికి అవకాశముంది. అందువల్ల ఈ నష్టాన్ని ఎట్లా సరిపుచ్చుకోవాలని ఆలోచిస్తున్నారు?

The Hon Sri K. CHANDRAMOULI :- అట్లా కోర్టుకు వెళ్ళే అవకాశమేమీ లేదు. అవన్నీ ప్రభుత్వం ఆలోచించింది, అందువల్ల వసూలు చక్కగా జరుగుతుందనే అనుకొంటున్నాము.

*Facilities for the export of Patee Marpu Handloom Cloth.*

**138—**

265 Q. SRI B. SANKARAIAH:- Will the Hon. Minister for Planning and Industries be pleased to state:

13th August 1956)

(a) whether any representation has been received by the Government to provide facilities for the export of the Patte Marpu ( పట్టె మార్పు ) Handloom Cloth; and

(b) if so, the action taken by the Government in the matter?

The Hon. Sri K. VENKATA RAO:-

(a) Yes, Sir. A representation was received in 1954 in this regard from the president, Nellore District Handloom Weavers' Congress, Nellore.

(b) The All India Handloom Board, Bombay was requested to examine the question of opening of depots in west Africa or of setting up an organisation for the purpose and to take suitable steps in the matter. The All India Handloom Board has informed this Govrnment that the matter has been kept in abeyance for the present.

A) అవునండి. 1954 సంవత్సరంలో నెల్లూరు Handloom Society President గారి దగ్గరనుంచి గవర్నమెంటు వారికి మహజర్ వచ్చింది.

B) అఖిలభారత Handloom Board, బొంబాయి, వారు యీవిషయాన్ని గురించి West Africa కు ప్రత్యేకంగా దీనిని గురించిన ఎగుమతికి తగినటువంటి చర్యతీసుకోవాలని కోరబడింది కాని వారు యీమధ్యనే దానిని కొంత కాలముగా abeyance లో పెట్టామని చెప్పి జబాబు పంపించారు.

Sri B. SANKARAIAH:— ఇప్పుడు మన ఆంధ్ర రాష్ట్రముఏరు ఐన తర్వాత మనకు ప్రత్యేకంగా exporting centre లేనందువల్ల ఇక్కడ తయారు య్యేదానిని ఎగుమతి చేయడానికి చాల ఇబ్బందులు కల్గుతున్నాయి. కనుక మన ఆంధ్రనుంచి export చేయడానికి ఒక centre ఏర్పాటుచేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

Tha Hon Sri K. VENKATA RAO:— ఈ పటె మార్పు విషయంలో కొన్ని monopoly houses వున్నాయట. ప్రత్యేకంగా West Africa లో అది వెనుకబడిన ప్రాంతంగనుక ఇంగ్లీషు కంపెనీలద్వారా తప్ప ఇంకొకరకంగా చేయడానికి వీలుకావడంలేదు. అందువల్ల వాండ్లు మన control లో లేరు. దీనిని గురించి మనము ఒక delegation ను పంపుదామనుకున్నాము, ప్రగడ కోటయ్య

13th August 1956)

గారిని కూడా పంపడానికి మేము సిఫార్సు చేశాము. కాని government of India ప్రస్తుతము నిలుపుచేశామని జవాబు వ్రాశారు.

Sri S. VEMAYYA:—ఈ పట్టెమార్కును ఇతరదేశాలకు పంపాలంటే పూర్తిగా మద్రాస్‌లో వుండే పెద్దవర్తకులమీద ఆధారపడ వలసివస్తుంది. అలాకాకుండా ఇక్కడనే ఏదో కార్పొరేషన్ ఏర్పాటుచేసి మన State ద్వారానే export సాగించేదానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా?

The Hon. Sri K. VENKAKTA RAO :— కార్పొరేషన్ అనేది చిన్నమాట వీరునేసేదంతా కలిపితే రెండు లక్షలు వుంటుంది. కార్పొరేషన్‌కు ఎంత కావాలో ఊహించుకోకుండా చెప్పితే లాభములేదు. పైగానేను చెప్పుతున్నది మద్రాస్‌లో లేదు ఇంగ్లాండులో వుంది బాధఅంతాకూడా. దానిని దిద్దుకోడానికి All India మొత్తముమీద చేయాలేకాని ఒక్క చిన్న రాష్ట్రము చేసిన ఫలితమేమీరాదు.

Sri B. SANKARIAH:- రెండు జిల్లాలంతా కూడా ఎక్కువగా యీ చేనేతమీద ఆధార పడుతున్నాయి. ఇపుడు Wholesale వ్యాపారమంతా మద్రాస్ నుంచే జరుగుతుంది. ఇక్కడ వుండే retail dealers, చేనేత పారిశ్రామికులు అందరికీ కలిపి ఒక కార్పొరేషన్ basis పైన చైనా ప్రభుత్వము సహాయంచేసి export కు facilities కల్గిస్తుందా ?

The Hon. Sri K. VENKATARAO:-ఇప్పటికీ శంకరయ్యగారు అర్థము చేసుకోరు. మద్రాస్ నుంచి export ఔతుంధన్నమాట నిజమే. మద్రాస్‌లో Indian firm కాదు English firm వున్నది. వాండ్లను మనము control చేయ లేకుండా వున్నాము. వాండ్ల తోటి deal చేసే వాండ్లే monopoly ని break చేయాలంటే పెద్దయత్నం చేయవలసి వస్తుంది. ఇదివరకే Govt. of India వారే ప్రయత్నం చేశారు. జరుగలేదు. అందుచేత దానిని గురించి మనమే ఒక delegation ను పంపి All India తరపున ఒక Export Council పెట్టుకొనే దాని కోసము యత్నం చేశారు. దానికి మన మనిషిని కూడా పంపిస్తా మనుకొన్నాము ఇక్కడనుంచి. కాని తాత్కాలికంగా ఆపు చేశామని చెప్పుతున్నారు. దానిని గురించిన చర్య అమలులోనే వుంది.

*Provision of house-sites for Harijans*

139—

* 451 Q.— SRI M. NAGI REDDI:- Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) whether there is any proposal to enhance the amount allotted for the provision of house-sites for Harijans; and

(b) if so, what is the amount to be so enhanced?

The Hon. Sri G. LATCHANNA:-

a) The answer is in the affirmative.

b) An amount of Rs. 4 lakhs in addition to the provision of Rs. 2 lakhs made in the budget for 1956-57 has been sanctioned for provision of house sites to Harijans for the year 1956-57.

(A) అవునండి.

(B) 1956-57 లో ఏర్పాటు చేసిన Budget provision 2 లక్షలు కాక అదనంగా 4 లక్షల రూపాయలు sanction చేయడం అయినది.

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :- అధ్యక్షా, మంత్రిగారు ఇంకా 4 లక్షలు ఎక్కువగా sanction చేశామని అన్నారు. $1\frac{1}{2}$ రూపాయలStamp తోఇదివరకే House sites కోసం గవర్నమెంటుకు application పెట్టిన వారికి ముందు అవకాశం ఇస్తారా? అంతేకాక 5వందల రూపాయలు కట్టిన వాండ్లకు అవకాశం ఇస్తారా? ఇస్తే ఎప్పుడు ఇవ్వ గలరు?

The Hon. G. LATCHANNA:- మొత్తం ఈ ఆరు లక్షల రూపాయలు వినియోగం చేసే విధానాన్ని గురించి ప్రభుత్వం ప్రత్యేక సూచనలు చేయడమైనది. అందులో రాజుగారు చెప్పినట్లు డబ్బు ముందు పెట్టినవాండ్ల proposals ముందు తీసుకోవలసిందని. awards issue చేసినవి తర్వాత తీసుకోవలసిందని. Awards stage కు వచ్చినవి ఆ తర్వాత తీసుకోవలసిందని చెప్పుతూ వాటితోనే ఆగిపోకుండా, ఇంకా అదనంగా గ్రామాలలో హరిజనులు తామే ఖర్చులు భరించు కొంటాము అనే స్థితి ఉన్నచోట కూడ ఆ Scheme లకు వెంటనే తగు చర్యలు తీసుకొన వలసిందని కూడా ప్రభుత్వం ఉత్తరువు చేసింది.

Sri M. NAGIREDDI :- ఇప్పుడు ప్రభుత్వం దగ్గర pending లో వున్న House sites petitionsకు ఇప్పుడు enhance చేసిన మొత్తం సరిపోతుందని ప్రభుత్వం భావిస్తుందా? లేకపోతే ఇంకా enhance చేయడానికి ఆలోచిస్తుందా?

(13th August 1956

The Hon. Sri G. LATCHANNA :- ప్రభుత్వం వద్ద pending లో ఉన్న మొత్తం petitions విలువ 20, 91, 957-4-0. ఇది చాలదు. అందుచేత ఇవి అన్ని ఏడాదిలో అమలు పరచలేము. ఈ ఏడాదిలో మనకు ఉన్న ఆర్థిక స్తోమతును పునః పరిశీలన చేసి ఏంతవరకు అదనంగా డబ్బు ఇవ్వడానికి వీలు ఉందో ఆలోచించి 4 లక్షలు అదనంగా ఇవ్వడం అయినది. మిగతావి వచ్చే ఏడాది. అట్లా క్రమ క్రమంగా ఆలోచించుకోవచ్చు.

Sri R. B. RAMAKRISHNA RAJU :- ఈ 4 లక్షలు, పల్లెలవారీగా పంచి పెట్టారా? లేకుంటే Fund గా ఉన్నదా?

The Hon. Sri G. LATCHANNA :- అది Director of social Welfare జిల్లావారీగా allot చేయవలసి యున్నది. ఇందాక మనవిచేసిన Basis ను అనుసరించి allotment జరిపించవలసిందని Director కు తెలియచేయడమైనది.

Sri S. VEMAYYA :-ఇప్పుడుడబ్బులేనందున అనేక eilesలో correspondence నిలిచిపోయినది. అట్లా కాకుండా డబ్బు వచ్చినప్పుడల్లా ఇవ్వవచ్చును కాబట్టి ఈFilesఅన్నిటిని close చేయకుండా అట్లే open గ పెట్టిఉంచి డబ్బు వచ్చినప్పుడల్లా అవి అక్కడినుంచే proceed కావలసిందిగా, అటువంటి ఉత్తరవులు క్రింది ఉద్యోగులకు పంపించడానికి పూనుకొంటారా?

The Hon. Sri G LACHANNA:- Files ఏమి కూడ lodge చేయమని ఉత్తరవులు గాని, Lodge చేసే విధానంగాని అమలులో లేదు.

Sri T. JIYYAR DAS :- ఇది హరిజనులకు ఇండ్ల ప్రత్యేక స్థలములను గురించి. ఇవి మళ్ళీ గ్రామ గర్భాలలోనే కట్టుతారా? ఈ మాలమాదిగ కొంపలలో కట్టించేసి, మాకున్నటువంటి అశ్పృశ్యతను అధికం చేయదలచారా? దానిని గురించి కమిటీని ఏర్పాటు చేశారు కదా? ఆ కమిటీ report లో ఏమి నివేదించారు? నివేదిక వచ్చేంతవరకైనా కట్టకుండా ఆపుతారా?

The Hon Sri G LATCHANNA:- Policy కి సంబంధించిన ప్రత్యేక ప్రశ్న వేశారు. ఇపుడు ఇండ్ల స్థలము ఇచ్చేది ప్రభుత్వం వీలైనంత వరకు ప్రభుత్వ స్థలం ఉంటే ఖర్చు లేకుండా ఇవ్వడం అనేది ఒక ఆచారంగా ఉంది. ప్రభుత్వ స్థలం ఇండ్లకు అనుకూలముగ లేనపుడు తక్కువ ఖరీదు గలది ఇండ్లకు అనుకూ

13th August 1956)

లంగా ఉండేది వెతకడం ఆచారం. ఇది ఒకప్పుడు గ్రామమధ్యన ఉండవచ్చును. గ్రామానికి బహిర్భాగంలో ఉండవచ్చును. ఈ కమిటీ వారి report మెన్న 8వ తేదీన ప్రభుత్వం వారికి అందింది. అది పరిశీలనలో ఉంది.

*Framing of Service Rules for the Municipal Commissioners*

**140—**

174 Q. SRI V. VISWESWARA RAO:- Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state.

Whether it is a fact that the framing of service rules for the Municipal Commissioners has been postponed due to States Reorganisation?

The Hon Sri A. B. NAGESWARA RAO.

The question of making rules to govern the service of Muncipal Commissioners is under the consideration of Government.

The Hon. Sri G. LATCHANNA: Answers to questions 5 and 12 are not with me as I have fergotten to bring the concerned files. I request the permission of the Chair to answer those questions on some other day.

Mr. SPEAKER: Yes. Mr. M Rajeswara Rao has requested the Chair to postpone his question No. 8 and it is also postponed

*Regional Research Stations for Millets in the State*

**14—**

11 Q- SRI N. C. SESHADRI: Will the Hon the Minister for Agriculture be pleased to state--

(a) whether it is a fact that the Government propose to start Regional Research Stations for Millets in the State and

(b) if so, where and what the details of the scheme are?

The Hon. Sri K. OBULA REDDI:-

(a) and (b) : A scheme for opening Regional Millet Stationsat Guntakal (Anantapur District), Dhone(Kurnool District), Atmakur (Nellore District), Proddatur (Cuddapah District), Sattenapalli (Gnntur District), Nandigama (Krishna District), and Chandragiri (Chittoor District) for the purpose of evolving high-yielding grains suitable for each region is under the consideration of the Government.

13th August 1956)

Sri M. NAGI REDDI :-ఈ research station లు పెట్టేదాంట్లో Consideration అంటున్నారు. ఎప్పటినుంచి ప్రారంభిస్తారు? ఏ ఏ millets ను గురించి ఈ research station లో research చేయబడుతుంది?

The Hon. Sri K. OBULA REDDI :- ఆయా ప్రాంతాలలో ఉండే millets అన్నిటిని గురించి research చేసే దానికి ఆలోచనలు ఉన్నవి. I. C.R. council తో Correspond చేస్తున్నాము. వారివద్దనుంచి జవాబు రాగానే ఇక్కడ అంతాకూడ take up చేస్తారు. మరి ముంగారి, పచ్చజొన్న విషయంలో కూడ research చేసే ఆలోచన ఉన్నది. దాని విషయంలో కూడా I.C.R. తో correspondence జరుపుతున్నాము.

Sri. P. SURYANARAYANA:- అధ్యక్షా, ఇపుడు మంత్రివర్గం. 6,7 జిల్లాలను గురించి చెప్పారు. మిగతా జిల్లాలలో ఇది పెట్టరా?

The Hon Sri K. OBULA REDDI :- పెట్టే దానికి ఆలోచన చేస్తారండి.

Sri G. YELLAMANDA REDDI:—అధ్యక్షా, మంత్రిగారు జొన్నల విషయంచెప్పారు. రాగులు, సజ్జలు ఇందులో లేవా?

The Hon. Sri K. OBULA REDDI :- ఉన్నవి. లేవని చెప్ప లేదు గదా.

Mr. SPEAKER :- ఏ ప్రాంతంలో ఏ millets దొరికితే వాటిని గురించి చేస్తామన్నారు?

## STARRED QUESTION POSTPONED FROM THE LIST FOR 10-8-1956.

*Creation of a seperate Department for fisheries Industry.*

**38**

* 195 Q- Sri S. VEMAYYA :- Will the Hon. the Minister for Agriculture be pleased to state-

(a) Whether there are proposals with the Government to create a separate Department for Fisheries Industry in this State; and

(b) if so, when it will be created?

5)

The Hon. Sri K. OBULA REDDI :- (a) and (b) The Government of Indiahave madea suggestion recently to theStateGovernmentfor establishing a separateDepartmnt of fisheries.But inview of the impending reorganisation of States the proposal has been deferred.

The Hon. Sri. K. OBULAREDDI :- ఆలోచనలో ఉన్నదండి. Hyderabad తో integrate కాబోతున్నాం త్వరలో. అందువల్ల ప్రస్తుతం ఇది defer చేయడమైనది.

Sri S. VEMAYYA :— ఈ fisheries department ను ఫేరుచేయడం డబ్బు మిగులు తుందనే ఉద్దేశ్యంతోనా?లేక ఇంకా ఏదైనా లాభదాయకంగా ఉంటుందని మొదలు పెట్టారా?

The Hon. Sri. K.OBULA REDDI:— లేదు. ఈ మత్స్యపరిశ్రమ చాలముఖ్యమైనది. కనుక ప్రత్యేకమైన departmant పెట్టితే గాని అభివృద్ధి చెందదు అనే ఉద్దేశంతో పెట్టాము.

Sri P. SURYANARAYANA:-అధ్యక్షా,మత్స్య పరిశ్రమ క్రింద శ్రీకాకుళం తాలూకా మునిసిపాలిటీ చెరువులలో రెండు తీసుకొన్నారు. వాటికి 4,5 సంవత్సరములు watchers ను పెట్టి చేపలువేసి అన్ని ఏర్పాట్లు చేశారు. గత సంవత్సరం watehers ను తీసివేశారు. కారణం ఏమిటో చెప్పగలరా?

The Hon. Sri K. OBULA REDDI :-మరొక ప్రశ్న వేస్తేచెప్పుతాను.

Note:- An asterisk at the commencent of aspeech indicates revision by the Member.

## II. MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES RE:

*Grazing facilities in forest land in the taken over Estates.*

Mr. SPEAKER : The Hon. Member Sri G. Yellamanda-Reddi wants to call the attention of the Hon. Minister for Land Revenue to a matter of urgent public importance.

Sri G. YELLAMANDA REDDI:- అధ్యక్షా, Taken over Estates లో ఉన్నటువంటి ఈ కంచెలు వేలంపాటలు వేస్తున్నారని ఇది వరకు ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాబడింది. Estates Land Act రీత్యా ప్రభుత్వానికి గాని, ఎవరికి గాని అధికారం లేదు. అయినప్పటికీ కూడ గత సంవత్సరం చట్ట విరుద్ధంగా వసూలు చేశారు. ప్రభుత్వదృష్టికి తీసుకొని వచ్చినా చర్య ఏమీ తీసుకోలేదు. రెండవ వైపున, ఈ Taken over Estates లోని forestలు అన్నికూడ Forest Department తీసు కొన్నది. అందువల్లForestDepartment permit system మీద ఒక వైపున పుల్లరి అన్ని పశువులమీద వసూలు చేస్తుంటే, రెండవ వైపున Revenue department వారు మళ్ళీ వేలంపాటలు పెట్టి, ఆలా ఇవ్వనందున, దొడ్లలోకి తోలి చాలా ఇబ్బందులు పెట్టుతున్నారు. అప్పుడే ఈ సంవత్సరం season వచ్చింది. కాబట్టి ప్రభుత్వం వారు Revenue Departmentకు తాఖీదులు పంపించి గ్రామాలలో వేలంపాటలు వేయమని ఆర్డరులు ఇచ్చారు. కాబట్టి, ఈ విషయమై Revenue మంత్రిగారు వెంటనే statement ఇచ్చి, వెంటనే దానిని ఆపించవలెనని నేను మనవి చేస్తున్నాను. ఎందువల్లనంటే ఇది రెండు సంవత్సరముల నుంచి జరుగుతూ ఉండే విషయం. మంత్రిగారు శాసనసభలో ఒక ప్రశ్న సందర్భంలో ఆలాంటివి ఏమీ వసూలు చేయడం లేదని చెప్పారు. అయినప్పటికి కూడ చేశారు. మళ్ళీ చేయబోతున్నారు కాబట్టి వెంటనే ఈ విషయమై చర్య తీసుకొనవలెనని మనవి చేస్తున్నాను.

The Hon. Sri K. CHANDRAMOULI:- ఈ double collections విషయంలో ఇదివరకు వారు చెప్పినమాట నిజమే. ఈ విషయమై Revenue Board తోను, నెల్లూరు జిల్లాకలెక్టరుగారితోను కూడ మాట్లాడాను. ఇదివరకు ఎక్కడైనా కొన్ని జరిగి ఉండినట్లయితే వాటిని చూపించి, ఇకముందు ఆటువంటివి లేకుండా, చేస్తామని చెప్పారు.

## III. GOVERNMENT RESOLUTIONS, RE:

*1. Increasing the maximum amount of guaratee given in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd.* ,

The Hon. Sri D. SANJIVAYYA:- Sir, I beg to move the following Resolution:-

"This Assembly recommends to the State Government that they may under sub-section (2) of Section 6 of the Madras Co-operative Land Mortgage Banks Act, 1934, increase the maximum amount of guarantee given by them in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd, up to a total face value of Rs.550 - lakhs, exclusive of such debentures as the Bank may from time to time redeem, such debentures being issued for periods not exceeding in any case 25 years from the date of issue and bearing at a rate not exceeding 5% per annum"

మనం మద్రాసు నుంచి విడిపోయి నూతన ఆంధ్రరాష్ట్రంగా ఏర్పడిన తర్వాత ఈ సహకార సంస్థలను కూడా మనం ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకొన్నాం. ఉమ్మడి రాష్ట్రానికి ఈ Central Land Mortgage Bank ఉండేది. మనం విడిపోయిన తర్వాత మన భాగానికి రు. 2, 76, 94,000 వచ్చింది. ఈ మొత్తం చాలదు. ఇక్కడ ఉన్న రైతులకు విశేషంగా అప్పు లివ్వాలని ఈ Act లోని Section 6 (i) క్రింద దానిని 450 లక్షలకు పెంచాము. అటువంటి అధికారం ప్రభుత్వానికి ఉన్నది. అందులోను ముఖ్యంగా నూతనంగా ఏర్పడిన రాష్ట్రం కాబట్టి Legislature కు రాకుండానే 450 లక్షల వరకూ దానిని ఏర్పాటు చేసినాము. ఇప్పుడు ఉన్నటువంటి దానినే ఎక్కువ చేయవలసి వచ్చినప్పుడు Section 6 (2) ప్రకారం శాసనసభలో సంప్రతించి వాళ్ళ అనుమతితో దాన్ని పెంచడానికి అవకాశం ఉంది. ఇప్పుడు 450 లక్షల వరకూ పెంచినాము. అయితే వాళ్ళు issue చేసినటువంటి వాళ్ళు తీసుకొన్నటువంటి అప్పులు 421 లక్షల వరకూ వచ్చింది. ఇక ముమ్ముందు అప్పులు తీసుకోవలసి వస్తే, డబ్బును సేకరించుకోవలసివస్తే, వారికి ఈ గవర్నమెంటు గ్యారంటీని ఇంకా ఎక్కువగా ఇవ్వాల్సివస్తుంది. బ్యాంకు యొక్క బైలాల ప్రకారం paid-up share capital,Reserve Sund కు 25 అంతలు వారు అప్పు చేయవచ్చును. అది దాదాపు 30 లక్షలు ఉన్నది. 30 లక్షలకు 25 అంతలు అంటే

(1) Increasing the maximum amount of guarantee given in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd.

13th August 1956) Sri D. Sanjivayya

దాదాపు వారు 750 లక్షల వరకూ borrow చేయడానికి అంతవరకు ప్రభుత్వం గారంటీ ఇవ్వడానికి అవకాశం ఉంది. అయినా ఇప్పుడు 550 లక్షల వరకే మనం అడుగుతున్నాం, ఇది తప్పకుండా ఈయడానికి సభవారు ఒప్పుకుంటారని నేను ఆశిస్తున్నాను.

Mr. SPEAKER:- Motion moved: 'This Assembly recommends to the State Government that they may under sub-section (2) of section 6 of the Madras Co-operative Land Mortgage Banks Act, 1934, increase the maximum amount of guarantee given by them in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd., up to a total face value of Rs.550-- lakhs, exclusive of such debentures as the Bank may from time to time redeem, such debentures being issued for periods not exceeding in any case 25 years from the date of issue and bearing interest at a rate not exceeding 5% per annum."

Sri V. VISWESWARA RAO:- అధ్యక్షా, ఈ Land mortgage Bank కు ఇప్పుడు అదనంగా 5 లక్షల రూపాయల Debentures ను float చేయడానికి దానిమీద గారంటీ ఇవ్వడానికి Government Resolution తీసుకొని వచ్చింది. అది చట్ట ప్రకారం కావాలని కోరుతున్నారు. కాని అసలు ఈ Land Mortgage బ్యాంకుల functions ను కూడా ఆలోచించ వలసిన అవసరం చాల ఎక్కువగా నున్నది, అంత కంటే ఈ Land Mortgage బ్యాంకులలో చాల మంది రైతులు ఈనాడు అప్పులు కావాలనడం జరుగుతోంది. అనేక రూపాలలో వ్యవసాయాన్ని అభివృద్ధి చేయాలని, గతంలో రైతుల కున్నటువంటి అప్పులు సాధక బాధకాలను తీర్చు కొనుటకు దీనిమీద ఎక్కువ వంతులలో, చౌక వడ్డీతో తీర్చుకొనే అవకాశం ఉంది కాబట్టి రైతాంగము వీటిలో చేరుటకు ఉద్యుక్తులగుచున్నారు. ఈ Land Motrgage బ్యాంకులలో అప్పులు sanction కావాలంటే, కనీసం 9 నెలలు పడుతుంది. 6 నెలల నుంచి 9 నెలల వరకు కూడా అనేక applications పరిష్కారం కాకుండా ఉండి పోయిన ఘట్టాలు చాల ఉన్నవి. ఈ విధంగా కాలయాపన జరుగడంవల్ల దీంట్లో అప్పులను పుచ్చుకొని వ్యవసాయాన్ని అభివృద్ధి చేయ

(1) Increasing the maximum amount of guarantee given in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd.

Sri V. Vesweswara Rao (13th August 1956

టానికి భూములను చదును చేసి భూములను మంచి స్థితిలో పెట్టడానికి కావలసిన చర్యలను తీసుకోవాలంటే ఈ అప్పులు వచ్చే సరికి ఆ పనులన్నీ పూర్తిఅయి తిరిగి కొత్త సంవత్సరం ప్రవేశిస్తుంది. ఆ అప్పులను sanction చేసి డబ్బు ఇవ్వ టానికి అగు ఎక్కువ ఆలస్యమును తగ్గించాల్సిన అవసరం చాల ఎక్కువగా ఉంది.

ఇలా ఆలస్యం ఎందుకు జరుగుతుందంటే Land Mortgage బ్యాంకులలో తా కట్టుపెట్టే ప్రతిభూమి విషయంలో కూడా 20 సంవత్సరాల చరిత్ర కావాలని దీంట్లో నియామకం ఉంది. 20 సంవత్సరాల చరిత్ర ఎందుకు కావాల్సివస్తుందో మాత్రం నాకు అర్థంకావడం లేదు. నేను దానిని పదేపదే చూచినప్పటికీ ఆ బ్యాంకుల పాలకులతో ఆలోచించినప్పటికీ కూడా భూమిని తాకట్టు పెట్టవలసివచ్చినప్పుడు 20 సంవత్సరాల చరిత్ర ఎందుకు కావాల్సి వచ్చిందో మాత్రం నాకు బోధపడటం లేదు. మామూలుగా లీగలుగా చూచినప్పటికీ కూడా 12 సంవత్సరముల చరిత్ర సరిపోతుందనీ 12 సంవత్సరాలలోనే దీన్ని పరిష్కరించ డానికి అవకాశం ఉందని అంగీకరిస్తున్నారు. కాని దీంట్లో 20 సంవత్స రాల చరిత్ర కావాలి. ఈ20 సంవత్సరాలలో మధ్య ఏఒక్క సంవత్సరం చరిత్ర లేక పోయి నప్పటికీ కూడా భూమి పనికి రాదని ఆ భూమిని తాకట్టు పెట్టుకోవడానికి వీల్లేదని అనేక సందర్భాలలో అభ్యంతరాలు పెట్టడం కూడా జరుగుతోంది. అందు వల్లనే ఎక్కువ కాలయాపన జరుగుతున్నదని, 20 సంవత్సరములను 12 సంవత్స రాలుగా మార్చటానికి ప్రభుత్వం ఆ బైలాలలో మార్పు తీసుకొని రావలసిన అవస రం ఉందని నేను మీద్వారా మంత్రిగారికి విన్నవిస్తున్నాను. ఇంకొక విషయం కూడా ఉంది. అనేక సందర్భాలలో ఈ Land Mortgage బ్యాంకులలో కొన్ని కొన్ని applications వస్తే కారణాలు లేకుండానే reject చేసేటటువంటి ఘటనలు కూడా చాలా ఉన్నవి. ఎందుకు రిజెక్టు చేస్తున్నారో మాత్రం తెలియదు.

ఈ బాంకులు చాలా సంవత్సరముల క్రింద organize చేయబడినవి. వారి స్వాధీనంలో ఉన్నాయి. నేటి పరిపాలనలో ఏమైనా అభ్యంతరం వస్తుందేమోనని అయినా ఊహించి లాండు మార్టిగేజి బాంకులలో పద్ధతులను సవ్యంగా జరిపించు కొనే అవకాశాలను కూడా కల్గించడంలేదు. అటువంటి రైతాంగానికి సౌకర్యాలను కలుగచెయ్యటానికి బైలాసులో amendments తీసుకొనిరావలసిన అవసరం

ఉంది. తీసుకరానంత కాలం ఎన్ని డిబెంచరులను float చేసినా రైతాంగానికి మాత్రం ఏమీ ఉపయోగం ఉండదు. అనేక పర్యాయాలు ఇక్కడ నేను చెప్పాను. జిల్లాలలో అనేక ప్రాంతాలలో కూడా ఈ Land Martgage బాంకులను విస్తరింప చేయడం జరుగటం లేదు. కృష్ణాజిల్లా తీసుకొంటే తిరువూరు, నూజివీడులకు ఈ బాంకులను స్థాపించవలసిన అవసరం ఎంతో ఎక్కువ ఉన్నప్పటికీ ఇంత వరకు జరిగే సూచనలేమీ కనబడటంలేదు. అక్కడ ఈ మధ్యనే రీసెటిల్‌మెంట్సు కొన్ని గ్రామాలలో పూర్తి అయినాయి. ఆ గ్రామాలను కూడా దీంట్లో చేర్చాల్సిన అవసరం ఉంది. దానికొరకై చర్యలను తీసుకోవలసిన అవసరం కూడా ఉంది. అలా పూర్తి అయిన గ్రామాల విషయంలో ఆలోచిస్తామని అనకుండా వెంటనే ఒక బాంకును అక్కడ పెట్టి, ఆ తాలూకాలో వెనుకబడిన జమీందారీ గ్రామాలను ఏ గ్రా మా ల లో నయితే Resettlements, Survey Settlements పూర్తి అయినవో ఆ గ్రామాలను వెంటనే చేర్చుకొనాలి. అలా చేసినప్పుడే రైతాంగం సౌకర్యముగ ఉండటానికి అవకాశం ఏర్పడుతుంది.

ఆఖరు విషయం. రైతులు అనేక చోట్ల అనేక మాసాలలో సంవత్సరముల తరబడి అప్పులు చేస్తున్నారు. రిపోర్టులను బట్టి చూస్తే అప్పులు ఆనాటి కానాడు పెరిగిపోతున్నవి. కాని ఈ బాంకులలో నుంచి అప్పు తీసుకొని పాత అప్పులను తీర్చడానికి వీల్లేదు. దానిని అభివృద్ధి పనులకొరకై వి ని యో గిం చు కోవాలి అనే రూపంలో ఈ మధ్యనే ఒక కొత్త బైలాను చేర్చినట్లు చెప్పటం కూడా జరుగుతోంది. ఒక వేళ మంత్రిగారు కాదు అని చెప్పవచ్చును. కాని ఈనాడు పాత అప్పులను తీర్చడానికి మాత్రం అప్పులనివ్వడానికి వీల్లేదని చెప్పడం జరుగుచున్నది. అటువంటి అప్పులను కూడా sanction చేయని పరిస్థితులనేకము లున్నవి. కాబట్టి వాటిని దృష్టిలోకి తీసుకోవాల్సిన అవసరం ఉందని మీ ద్వారా మంత్రిగారికి తెలియజేస్తున్నాను. ఈ విధంగా తీ సు కొ ని వచ్చినప్పుడే ఈ Land Mortgage బాంకులు ప్రజానీకానికి ఉపయోగపడుతాయని, అందుకొరకు సత్వర చర్యలను తీసుకోవలసిందని కూడా మంత్రి గారిని కోరుతున్నాను.

Sri P. NARASIMHAPPA RAO :- అధ్యక్షా, మంత్రిగారు ప్రతిపాదించిన తీర్మానమును నేను బలపరుస్తూ కొన్ని సూచనలు చేస్తున్నాను. ప్రజలకు

(1) Increasieg the maximum amount of guarantee given in re spect of the debentures issued by the Andhra Co-operativa Central Land Mortgage Bank Ltd.

Sri. P. Narsimhappa Rao. 13th August 1956]

ఎక్కువ సౌకర్యములు కలుగజేయాలనే ఉద్దేశ్యం మంత్రిగారి తీర్మానంలో ఉన్న ప్పటికీ కొద్ది మార్పుచేయ వలసిన అవసరం ఉన్నది. మనరాష్ట్రంలో జమీందారీ గ్రామాలు, unsurveyed villages చాలా వున్నాయి, శ్రీకాకుళంజిల్లాలో ఎక్కువ భాగం జమీందారీ గ్రామాలే. Un-surveyed villages లోని వారు అప్పుల కొరకు ధరఖాస్తు పెట్టుకుంటే వారికి అప్పు ఇవ్వడానికి వీలులేదంటున్నారు. ఆప్రక్కనున్న గ్రామాల వారికి మాత్రం ఇస్తున్నారు. అప్పులు యిచ్చే విషయంలో అన్ని గ్రామాల వారికి ఒకే విధంగా సౌకర్యాలు కలుగ జేయాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. Unsurveyed villagers అన్నివిధములైన పన్నులు చెల్లిస్తున్నప్పటికీ కూడా వారికి అప్పు లివ్వడానికి అవకాశం లేకపోతోంది. ఈ లోపము సర్దుబాటుచేసి రైతులందరికీ ఒకే విధంగా సౌకర్యాలు కలుగ జేస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:-- అధ్యక్షా,మంత్రి గారు తీసుకువచ్చిన తీర్మానమును నేను బలపరుస్తున్నాను.

Land Mortgage Banks రైతులకు సహాయం చేయుటకు ఉద్దేశింప బడినాయి. కాని అవి మనం ఆశించినంతగా సహాయంచేయుట లేదని ప్రభుత్వం కూడా అంగీకరింస్తుందను కొంటున్నాను. కొన్ని తాలూకాలకు కలిపి ఒక Land Mortgage Bank ను ఏర్పాటు చేసినారు. ఆ Bank ఉన్న తాలూకాలోని వారికి ఎక్కువ ప్రాముఖ్యంవుంటుంది. ఇతర తాలూకాల వారికి అంతగా అవకాశం దొరకుట లేదు. అట్లా జరుగుట లేదని మంత్రిగారు అన్నారు. అదినిజమైతే మేము చాలాసంతోషించే వారము. మా సత్తెనపల్లి తాలూకాకు, గుంటూరు తాలూకాకు కలిపి ఒక Bank ను గుంటూరులో ఏర్పాటు చేసినారు. ఇందువల్ల మా తాలూకా వారికి అంతగా అప్పులు దొరకుటలేదు. ఈ విషయం గురించి నేను State Bank వారికి వ్రాసినాను. "ఇది ప్రభుత్వానికి సంబంధించిన విషయం. మేము ఏమీ చేయలేము అని" సమాధానంఇచ్చారు. మాతాలూకాలో ఉన్న ఆస్తినంతా తాకట్టుపెడతామన్నా సరే అప్పుదొరకడం కష్టంగావుంది.జిల్లాకు ఒక Bank ను ఎట్లా ఏర్పాటుచేశారో అదే విధంగా ప్రతి తాలూకాకు ఒక Bank ఏర్పాటు చేయాలని కోరుతున్నాను.

బాగా వెనుక బడిన తాలూకాలను వదలిపెట్టి property వుండి applications గల తాలూకాలకు ఒక Bank ను ఏర్పాటు చేసినట్లయితే ఈ వ్యవహారం సక్రమంగా కొనసాగుతుంది.

ఇందులో నిర్బంధాలు ఎక్కువగా ఉండడంవల్ల applications రావడం ఆలస్యమవుతోందని విశ్వేశ్వర్రావు గారన్నారు. నిర్బంధాలు తప్పకుండా వుండాలి. కాని అవి అప్పులను ఎగగొట్టడానికి దారి తీసేవిగావుండకూడదు. కాని application పెట్టిన వారికి డబ్బు ఇవ్వకుండా ఉండేపద్ధతిలో మాత్రం ఆ నిర్బంధాలు ఉండ కూడదు. ఇందులోవున్న కఠిన నిబంధనలను తగ్గించి తాలూకాకు ఒక Bank ను యేర్పాటు చేయాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

Sri B. RAMA REDDI :- అధ్యక్షా! ముఖ్యమంత్రి గారు ప్రవేశపెట్టిన తీర్మానమును ఆమోదిస్తూ 2,3 సూచనలు చేస్తున్నాను. అసలు రైతుల ఋణ విమోచన కొరకు ఈ Land Mortgage Banks నెలకొల్ప బడినాయి. కాని అప్పులు ఇచ్చే విషయంలో చాలా చిక్కులు ఉంటున్నాయి. రైతు అప్పు కొరకు ధరఖాస్తు చేస్తే అతనికి బ్యాంకువారు ఇచ్చు అప్పుకు మిగిలి extra debt వున్నపైతే, ఆ extra debt తీర్చిన తరువాత గానీ అప్పులు ఇచ్చుటలేదు. ఇటువంటప్పుడు ప్రజలు చాలా ఇబ్బంది పడుతున్నారు. రైతులకు అప్పులు ఇచ్చి తిరిగి వారు పండించే ధాన్యంమీద వాయిదాల ప్రకారం వసూలు చేసుకుంటే బాగుంటుంది. అట్లా చేసినట్లయితే రైతుకు ఋణ విమోచన అనేది సాధ్యపడుతుంది, పైగా అప్పులు ఇచ్చుటలో చాలాఆలస్యం అవుతోంది. రైతులు చాలా ఇబ్బంది పడుతున్నారు. అప్పులు త్వరగా యిచ్చే ఏర్పాటు చేయించాలని కోరుతున్నాను.

Sub-Registrars Office లో Encumbrance Certificates తీసుకోవడంలో 2, 3 నెలలు ఆలస్యం అవుతోంది, దీనిని గురించి అప్పులు sanction అవ్వడానికి కూడా చాలా ఇబ్బందికల్గుతోంది.

పట్టాలు గల్గిన ఈనాందారులకు, వారు ఆ యీనాములను వంశపారంపర్యంగా అనుభవిస్తున్నప్పటికీ కూడా అప్పులివ్వకపోవడం చూస్తే చాలా కష్టంగా ఉంది. ఈనాందారులకు కూడా అప్పులిచ్చే సౌకర్యం కలుగజేసినట్లయితే ఈ బిల్లు ప్రజలందరకు ఆమోదయోగ్యం కాగలదని ఆశిస్తూ విరమిస్తున్నాను.

(1) Increasieg the maximum amount of guaratee given in resppect of the debentures issued by the Andhra Co-oparative Central Land Mortgage Bank Ltd.

(13th Augugst 1956

Sri S. JAGANNADHAM :- అధ్యక్షా మంత్రిగారు ప్రవేశపెట్టిన తీర్మానమును బలపరుస్తూ కొన్ని సూచనలు చేస్తున్నాను.

రైతులకు సహాయం చేయడంకొరకు బ్యాంకులు అప్పులిస్తున్న మాట నిజమే. ఇదివరకు 10 వేల రూ॥ల వరకు అప్పు యిచ్చేవారు. ఇప్పుడు 5 వేల వరకూ యిస్తున్నారు. దీనిని తిరిగి 10 వేలకు పెంచాలని మనవి చేస్తున్నాను. Lands improvement కు అప్పు ఇస్తున్నారు. కాని ముందుగా Lands ను improve చేసినట్లయితే అప్పు ఇస్తామంటున్నారు. డబ్బు ముందుగా రైతుదగ్గర ఉంటే బాంకులో అప్పు కావాలనడం ఎందుకు ? ఆ రైతు దగ్గరనుంచి ఇచ్చిన డబ్బు తిరిగి రాబట్టు కోడానికి తగిన property వుందా, లేదా అనేది ఆలోచించి అప్పులు ముందుగా ఇచ్చేటట్లు ఏర్పాటు చేసినట్లయితే బాగుంటుందని మనవి చేస్తూ విరమిస్తున్నాను.

Sri P. SURYANARAYANA:- అధ్యక్షా, మంత్రిగారు తీసుకు వచ్చిన తీర్మానమును బలపరుస్తూ కొన్ని సూచనలను చేస్తున్నాను. చాలా కాలం నుంచి శ్రీకాకుళం జిల్లాలో ఒక Land Mortgage Bank వుంది. అప్పుకోసం ధరఖాస్తు చేస్తే 3, 4 సంవత్సరాలకు కాని ఇవ్వడం జరుగుటలేదు.

గుండుకోలు అన్నాయమ్మ అనునామె అప్పుకొరకు దరఖాస్తు చేసి 4 సంవత్సరాలు అయింది, నేనే recommend చేశాను. ఇంత వరకు అప్పు ఇవ్వలేదు. ప్రజలకు కావలసి నప్పుడు ధరఖాస్తు పెట్టిన వెంటనే డబ్బు ఇవ్వకుండా 4, 5 సంవత్సరాలు ఆలస్యం చేస్తే ఆ బాంకు ఉండి మాత్రం ప్రయోజనం ఏమిటి ? అందుచేత అప్పులు తొందరగా ఇచ్చేటట్లు ఏర్పాటు చేయించాలని ముఖ్యమంత్రి గారిని కోరుతూ విరమిస్తున్నాను..

Sri S. VEMAYYA :- అధ్యక్షా ! అప్పులు ఇచ్చే విషయంలో (Pre-war rates) 1947-48 సంవత్సరాల లోని రేట్లు దృష్టిలో పెట్టుకొని ఇవ్వడం సబబు కాదనుకుంటాను. అప్పులు ఇవ్వడానికి వీలుగా ప్రభుత్వంవారు ఆలోచించి తగిన ఉత్తరువులు జారీ చేయించాలని కోరుతున్నాను.

Sri G. NARSIMHA MURTHY:- అధ్యక్షా: మంత్రిగారు తీసుకు వచ్చిన తీర్మానమును నేను బలపరుస్తున్నాను. ఈ బ్యాంకులోని పెద్దలు వారికి

ఇష్టమైన వారిని సభ్యులుగా చేర్చుకోవడం, ఇష్టంలేని వారిని చేర్చుకోక పోవడం జరుగుతోంది. అప్పు అవసరమైన వారిని సభ్యులుగా చేర్చుకొనే అవసరమున్నది. కొద్ది ఆస్తి కలిగిన Co-perative Socitiesలో అప్పుతీసుకోవాలంటే, అవిఇచ్చినట్లయితే ప్రజలు మొత్తమంతా ఒకసారి కట్టలేక పోవడం వల్ల పరపతిని పొందుటకు అవకాశం లేకపోతుంది. భూమి తనఖా బాంకులలో చిన్న రైతులుకూడా ఏ రు. 200 లో ఎంతో అప్పు తీసుకొని వ్యవసాయం చేసుకోడానికి అవకాశం ఉండేటట్లు తక్కువ మొత్తంగా కూడా హెచ్చుమందికి అందేటట్లు, యేర్పాటు చేయాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

Sri P. VENKATASUBAYYA:- అధ్యక్షా: Central Land Mortgage Bank వారు issue చేసిన Debentures పైన 550 లక్షల వరకు గ్యారంటీ ఇవ్వడానికి ప్రభుత్వం పూనుకొన్నందు వల్ల Central Land Mortgage Bank వారు ఇచ్చే అప్పులు సకాలంలో వసూలు కావాలనే గురుతర మైన భాధ్యత కూడా ప్రభుత్వంవారు తీసుకోవలసి యున్నది. Application పెట్టిన తరువాత అది sanction అయ్యేటప్పటికి 6, 7 నెలలు అవుతోంది, Co-operative Supervisors, Registrars, Directors of CentralLand Mortgag Bank నుంచి వచ్చి పరిశోధనలు చేసేటప్పటికి చాలా వ్యవధి తీసుకొంటున్నది అప్పు సకాలానికి అందుట లేదు.

అదికాకుండా loan కు application పెట్టినప్పుడు ఒక Encumbrance Certificate, sanctionఅయిన తరువాత ఇంకొకEncum brance certificate అప్పు పంపకం అయ్యేటప్పుడు ఇంకొక Encumtrance Certificate ఇవ్వవలసి వస్తున్నది. ఇందువల్ల రైతులు చాలా బాధపడుతున్నారు.

ఈ precautions అ వసరమే అయినప్పటికీ ఈprocedure ను కొద్దిగా సవరించి ఈ Central Land Mortgage Bank legal advisor సలహా ముందుగా తీసుకొని, తరువాత Sub-Registrar ను పంపించి తనఖీ చేయించి సాధ్యమైనంత వరకు procedure లో వుండే లోపాలను తగ్గించడం సబబుగా ఉంటుందని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

(1) Increasing the maximum amount of guarantee given in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd..

(13th August 1956

The Hon. Sri D. SANJIVAYYA:- అధ్యక్షా, గౌరవనీయసభ్యులు చేసినటువంటి సూచనలలో ఆలస్యము జరుగుతోందనేది ప్రధానమైనది. అవసరానికి లేకపోతే నిష్ప్రయోజనమే అవుతుంది. కాబట్టి ఆలస్యం లేకుండా చేయమంటున్నారు. ఇప్పుడు 550 లక్షలకు ప్రభుత్వము guarantee ఇస్తున్నారు. Central Land Mortigage Bank వారు Primary Land Mortigage Bank వారు రైతులకు అప్పులు ఇస్తున్నారు. వారు శ్రద్ధగా పరిశీలన చేయకుండా అప్పులు ఇచ్చినట్లైతే, ఆ అప్పులు సకాలంలో వారు వసూలు చేసుకోలేక పోయినట్లయితే ఎవరికి నష్టమో ఆలోచించమని సభ్యులకు మనవి చేస్తున్నాను. 550 లక్షల రూపాయలకు Guarantee ఇచ్చినాము. 150 లక్షల రూపాయలు ప్రజలవల్ల అప్పుల రూపంగా Central Land Mortgage Bank వారు తీసుకొంటున్నారు. అటువంటప్పుడు రైతులకు అప్పులు చూపించ వలసిన బాధ్యత CentralLand Mortgage Bank వారిపైన ఉన్నది. వారు చెల్లించకపోయినట్లయితే రాష్ట్రప్రభుత్వమే వారికి చెల్లిస్తుందనే guarantee కూడా ఇస్తున్నారు. అందువల్ల ప్రభుత్వానికి నష్టంవస్తుంది. ప్రభుత్వానికి నష్టం వస్తే, అది ప్రజల డబ్బే ననే విషయం కూడా మనం జ్ఞాపకముంచుకోవాలి. ఏమైనప్పటికీ త్వరగా విచారణ చేసి అప్పులు ఎంత త్వరగా ఇవ్వడానికి అవకాశం ఉంటుందో అంత త్వరగా ఇవ్వడానికి ప్రయత్నము చేయవలెనని ఉత్తర్వులు జారీ చేస్తాము. మూడు మాసాలుగా pending లో ఉన్నటువంటి విషయాలను కూడా సభ్యులు మా దృష్టికి తెచ్చారు. ఎక్కువ ఆలస్యము జరగకుండా ఉండేటట్లు చేయవలెనని Land Mortigage Bank వారికి తెలియజేస్తాము. Improvements కే అప్పులు ఇస్తున్నారు. పాత అప్పులు తీర్చేదాని కొరకు అప్పులు ఇవ్వడం లేదంటున్నారు మొట్ట మొదట పాత అప్పులు తీర్చేదాని కొరకే ఇవి ప్రారంభింపబడినవి. తరువాత క్రమేణా పాత అప్పులు అన్నీ పోయినాయి. ఇక పొలాలను అభివృద్ధిచేసి అధికాహారోత్పత్తి చెయాలనే ఉద్దేశ్యముతో improvements కే అప్పులు ఇవ్వాలనే టటువంటిది ఇప్పుడు పెట్టాము. అయినా old debts redeem చేసేదానికికూడా అవకాశం ఇవ్వాలనేటటువంటి విషయం నాకు తెలుసు. ఈ ప్రాంతంలో కర్నూలులోనే Land Mortgage Bank representatives ల conference జరిగింది. అప్పుడు వారికి నేను సలహాకూడా ఇచ్చాను. Zamin areasలో అనేకం ఉన్నాయి. అవి సర్వే కానివి.

Sri L. LAKSHMANA DAS:-మంత్రిగారు రైతులకు అప్పులు లేవని ఉద్దేశ్యపడుతున్నారు. కాని, ఈనాడు మన రిపోర్టు వ్యవహారాలను, దేశంలోని పరిస్థితులను చూసుకుంటే రైతులకు ఇంకా చాల అప్పులు private lending ద్వారా ఉన్నట్లు తెలుస్తున్నది. Land Mortgage Banks ద్వారా హెచ్చుగా పాత అప్పులు తీర్చేందుకు ఇవ్వడానికి ఏర్పాట్లు చేయాలని కోరుతున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA :-ఈ పాత అప్పులు తీరుస్తూ రైతులు భూములను అభివృద్ధి చేసుకొనే కార్యక్రమం కూడా తలపెట్టాలనే ఆలోచిస్తున్నాము. ఇకమీదట అవసరమైతేతప్ప అప్పులు చేయకూడదని నేను రైతులకు మనవి చేస్తున్నాను. Land Mortgage Bank, Co-operative Credit Society మొదలైనవన్నీ అప్పులు ఇస్తున్నాయిగదా అని ఇష్టమువచ్చినట్లు అప్పులు తీసుకొని తరువాత వాటిని తీర్చలేక నానా అవస్థలు పడుతున్న రైతాంగానికి అసలు అప్పులే తీసుకోవద్దని మనవి చేస్తున్నాను. ఈనాడు ఒక రైతు కొడుకు పెండ్లి చేశాడంటే అప్పు తెచ్చి 50 వేలు ఖర్చుపెట్టి దర్జాగా చేస్తున్నాడు.ఇదంతా ఎందుకు చేస్తున్నాడో అర్థం కాకుండా ఉన్నది. అందువల్ల అవసరమైతేతప్ప అప్పులు ఎక్కువగా చేయవద్దని రైతాంగానికి వినయపూర్వకంగా మనవి చేస్తున్నాను.

ఇందులో survey అయినా lands నే చెర్చాలని ఉన్నది. Unsurveyed lands ను చేర్చడానికి అవకాశంలేదు. కొన్ని గ్రామాలే సర్వే అయి ఉంటే ప్రక్కన ఉన్నటువంటి Land Mortgage Bank jurisdiction క్రింద చేర్చడానికి ఇంతకు ముందే instructions ఇచ్చాము. ఆ విధంగా కొన్ని చోట్ల చేర్చారుకూడా. అయిదు వేలో ఎంతో unit ఉన్నది. ఇంకా ఎక్కువగా అప్పులు ఇస్తే బాగుంటుందని సభ్యులు సలహాయిచ్చారు. Surveyed lands అయితేనే చేర్చడానికి అవకాశం ఉన్నదిగాని unsurveyed lands ను చేర్చడానికి అవకాశం లేదు. ఒక తాలుకాలో కొన్ని గ్రామాలు మాత్రమే Survey అయినట్లయితే ఆ గ్రామాలను ప్రక్కన ఉన్నటువంటి Land Mortgage Bank jurisdiction క్రింద చేరుస్తాము. రైతులకు అప్పులు వస్తాయి. మొత్తం తాలూకా అంతా Survey అయిన తరువాత కావలసి వస్తే వారికి ప్రత్యేకంగా Bank పెట్టడానికి ప్రయత్నము చేస్తాము.

Sri R. B. RAMAKRISHNA RAJU :- Taken over Estates లో ఇప్పుడిపుడే Survey అవుతున్నది. ఇంకా ఈ Survey పూర్తి కావడానికి 5

ఏండ్లు పడుతుంది. అంతవరకు Estate Land Mortgage Banks పెట్టడానికి సాధ్యం కాదా ?

The Hon. Sri D. SANJIVAYYA :- సర్వే కానిదే పెట్టడానికి వీలు లేదు. విలువలు కట్టే విషయంలో ఎప్పుడో యుద్ధానికిపూర్వం ఉన్నధరలను తీసు కొని దానిమీద formula అంతా work out చేస్తున్నారు. అది సరైనదికాదు. ఇప్పుడు భూములధరలు విశేషంగా పెరిగాయి. ఈ ధరలను బట్టి విలువకట్టి ఆధ రల ప్రకారము అప్పులు ఇచ్చేపద్ధతి ఏర్పాటు చేయాలని అన్నారు. ఆవిషయం కూడా మొన్న జరిగినటువంటి సమావేశంలో మేమంతా చర్చించాము. చర్చించిన తరువాత అక్కడ ఉన్నటువంటి ఆఫీసర్లకు instructions ఇవ్వబడినాయి. దాని ప్రకారం వారుఅన్ని ఏర్పాటులు చేస్తారు. ఆ మార్పులు తీసుకుని రా వ టా ని కి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

సభ్యత్వాన్ని గురించి గూడా మనవిచేశారు. చట్టంప్రకారం అక్కడ ఉండే టటువంటి సంఘాలు ఉండే Cooperative Credit Soeietics గాని Primary Land Mortgage Banks గాని Central Land Mortgage Bankగాని సభ్య త్వాన్ని అక్కడ ఉన్న సర్వ సభ్య సమావేశంలో నిరాకరించినట్లయితే ప్రభుత్వము ఏమిచేయ డానికి వీలుఉండదు. దానికి చట్టంలో మార్పు కావలసి వస్తుందని మనవి చేస్తూ ఈతీర్మానాన్ని ఆమోదించాలని కోరుతున్నాను.

Sri P. VENKATASUBBAYYA :- రైతులకు సంపూర్ణంగా బాకీని పరిష్కారంచేసే పద్ధ తినిగురించి నేను మనవిచేసి ఉంటే దానికి reply రాలేదు.

The Hon. Sri D.SANJIVAYYA :- ఆలోచించా మండి ఆ లో చి స్తా మ ం డి.

Mr. SPEAKER:- The question is:

"This Assembly recommends to the State Government that they may under Sub-Section (2) of Seetion 6 of the Madras Cooperative Land Mortgage Banks Act, 1934, increase the maximum amount of guarantee given by them in respect of the debentures issued by the Andhra Co-operative Central Land

(1) Increasing the maximum amount of guarantee given in respect of the debentures issued by the Andhra Co-operative Central Land Mortgage Bank Ltd.

13th August 1956) Sri. D. Sanjivayya

Mortgage Bank Ltd., up to a total face value of Rs. 550-- lakhs, exclusive of such debentures as the Bank may from time to time redeem, such debentures being issued for ,periods in any case 25 years from the date of issue and bearing interest at a rate not exceeding 5% per annum."

The motion is carried and the resolution passed.

---

*(2) Ratification of the amendments to the Seventh Sehedule to and Articles 269 and 286 of the Constitution of India*

The Hon. Sri D. SANJIVAYYA :- Sri I beg to move the follhwing resolution:

"This House ratifies the amendments to the seventh Schedule to and Articles 269 and 286 of the Constitutionof India proposed to be made by the Constitution ( Sixth Amendment) Bill, 1956, as passed by two Houses of Parliament."

Inter-State transaction మీద Sales tax విషయాన్ని గురించి Supreme Court వారు ఒక తీర్పు ఇచ్చారు. ఆతీర్పు ప్రకారము State Government కు Inter-State transaction మీద Sales Tax వసూలు చేయడానికి అవకాశం లేదన్నారు. ఆ కారణంచేత అంతకు పూర్వం వసూలు చేసినటువంటి sales tax ను legalise చేయడానికి Central Government వారు ఒక Ordinance ఇచ్చారు. అది జరిగింది. ఈ Judgement 1955 September లో వచ్చింది.1-1-54 నుంచి Inter State Sales Tax నుState Government.colleet చేస్తూ వచ్చింది. అట్లా 30-9-55 వరకు వసూలు చేసినది. అవిధంగా వసూలుచేసిన మొత్తం 45 లక్షలు. ఇంకా మాకురావలసి నటువంటి మొత్తం అంటేమేము assess చేసి వాళ్లు ఇవ్వకుండా ఉన్న మొత్తం 50 లక్షలు. ఆ 50 లక్షలు కూడా వసూలు చేయవలసిన అగత్యం ఉన్నది. ఇప్పుడు Supreme eourt Jadgement ప్రకారం Central Government Constitution లో ఉండే టటువంటి కొన్ని విషయాలు amend చేసి ఆ amendment ప్రకారం మరల

Inter-State tax ను వసూలుచేయడానికి అవకాశం కల్పిస్తున్నది. అయితే ఇంతకు పూర్వం 7th Schedule లో State list లో ఉండేటటువంటి subfect ఇది, అని దానిని Union listలోకి తీసుకొని వెడుతున్నారు. అందువల్ల 7th schedule కు ఎటువంటిamendment తెస్తామో ఆ amendment ను Both Houses of the Parliament pass చేసిన తరువాత part A. B. రాష్ట్రాలలో కనీసం సగమైన దానిని ratify చేస్తే దానిని Preisdent ఆమోదానికి పంపవలసి ఉంటుందీ. ఇప్పుడు అది pass చేసినారు. President ఆమోదానికి పంపడానికి అవకాశంలేకుండా ఉన్నది. అన్ని Assemblies వారిని ఈవిషయమై కేంద్ర ప్రభుత్వంవారు అడిగినారు. కాబట్టి దీనిని మనంత్వరగా పంపవలసిన అగత్యంఉన్నది. కాబట్టి దీనిని 15 August లోగా పంపమని వారు పదే పదే వ్రాస్తున్నారు. ఆకారణం చేత ఈ తీర్మానాన్ని అమోదించాలని కోరుతున్నాను.

Mr. SPEAKER: Motion moved:

"This House ratifies the amendments to the seventh Schedule to and Articles 269 and 286 of the Constitution of India, proposed to be made by the Constitution ( Sixth Amendment ) Bill, 1956. as passed by two Houses of Parliament."

Sri VAVILALA GOPALA KRISHNAYYA :- అధ్యక్షా, ఈ బిల్లు తీసుకు రావడంలో కేంద్ర ప్రభుత్వం కోర్టు నిర్ణయాల కన్నా ముఖ్యంగా Taxtion Committee సూచనల మీద ఆ ధా ర పడిందేమో సనిపిస్తోంది. Taxation కమిటీ చెప్పినట్లు మొట్టమొదట Bombay State కు స్థానికంగా వచ్చి నటువంటి వివాదంలో అతని దగ్గరకు పోయి వసూలు చెయ్యడానికి వీలులేదు. కావలన్నట్లయితే Government లో ఎక్కడైనా అమ్మకం జరుగుతోంటే, ఆ అమ్మకం చోటికి మీ ప్రభుత్వం తరపున ప్రతినిధిని పంపించి ఆ లెక్కలన్నీ చూసి అక్కడనే తీసుకోవాలి గాని మరొక విధంగా వీలు లేదని చెప్పారు. అన్ని రాష్ట్రాలలో కూడా, బొంబైవంటి ప్రధాన పారిశ్రామిక కేంద్రాలు పారిశ్రామిక వస్తు ఉత్పత్తి జరుగుతున్నటువంటి రాష్ట్రాలలో అక్కడికి అధికారులను పంపించి వాళ్ల దగ్గర లెక్కలు తీసుకొని ఆ ప్రకారం వసూలు చేస్తూవచ్చారు. కాని తరువాత Bengal Chemical Industries కు West Bengal Gouernment కు వచ్చి నటువంటి వివాదంలో ఒక Government ఇంకో గవర్నమెంటు లోనుంచి తీసుకోవడానికి

వీలు లేదనే నిర్ణయానికి వచ్చేటప్పటి కల్లా కేంద్ర ప్రభుత్వము పునరాలోచన చెయ్యడం తటస్థించింది. కాని Constitution లో ఉన్న టు వంటి 3 రకాలలో రాష్ట్రాల శాసనాలకు సంబంధించినవి ఒకటి కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినవి ఒకవి ఉన్నాది. ఈ రెండు కాకుండా ఏమి చేయడం అనే సమస్య ఒకటి వచ్చింది. ఈ పరిస్థితుల గురించి ఆలోచిస్తున్న సమయంలో వీళ్లకు ఇదిరావడంలో చాల ఉపయోగం కలిగింధి. అందువల్ల ప్రభుత్వం వెంటనే ఒక Ordinanceను pass చేసి రాష్ట్ర ప్రభుత్వాలు అంతవరకు వసూలు చేస్తున్నటువంటి అంతరాష్ట్ర అమ్మకం పన్నును ఊరికే పోనీయకుండా మళ్ళీ ఆరాష్ట్రాలకు ఇచ్చేందుకు ఒక Ordinance ను pass చేశారు. అటుతరువాత శాసనసభలో పార్లమెంటు బిల్లు pass చేసినది. ఆ ప్రకారం అంతవరకు ఉన్నటువంటి డబ్బు ఏదో కొద్దిగానైనా వచ్చింది. ఇవ్వాళ్టి position ఏమిటి అనేదే ప్రశ్న. కేంద్రప్రభుత్వానికి Taxation Committee చెప్పిన సలహా ప్రకారం కొన్ని ప్రధానమైనటువంటి వస్తువులు ఉన్నాయి. అవన్నీ కూడా కేంద్రప్రభుత్వం తీసుకొని Tax వేయాలని చెపుతున్నది. దీనివల్ల చాల ప్రధానమైనటువంటి సమస్యలు కూడా రేకెత్తు తున్నాయి.

ముఖ్యంగా రాష్ట్రాలకు ఉన్నటువంటి స్వాతంత్ర్యము ఏమిటి? రాష్ట్రాలకు వచ్చేటటువంటి ఆదాయము ఏమిటి? రాష్ట్రాలకు వచ్చేటటువంటి ఆదాయములో కేంద్ర ప్రభుత్వము తీసుకొన్నప్పుడు, రాష్ట్రాలస్థితి ఏమవుతుంది? ఇండియా విభజన జరిగినపుడు, 1947 సంవత్సరం Government of India Act రాక పూర్వం ప్రధానంగా Constituent Assembly ఏర్పడి నపుడు ఒక సమస్య వచ్చింది. అప్పుడు, రాష్ట్రాలకు ఎంత హక్కు ఉండాలి. కేంద్రానికి ఎంత హక్కు ఉండాలి అనే సమస్య వచ్చినప్పుడు, కేంద్రానికి నిర్వహించేందుకు నాలుగు subjects మాత్రము ఇవ్వాలని, వాటికి కావలసినటువంటి ఆదాయాన్ని వాళ్ళే వసూలు చేసుకొనేటట్లు ఉండాలి, తక్కినదంతా కూడా రాష్ట్రాలకు వెళ్ళాలి అని చెప్పారు. అటు తరువాత దాన్ని వివరించడం అనే కారణం తోటి, దీని కొక జాబితా, కేంద్రానికొక జాబితా, రెండు కలిపి ఒక ఉమ్మడి జాబితా, ఇవన్నీ తీసుకోవడం వచ్చేటప్పటి కల్లా దాదాపు రాష్ట్రానికి వచ్చినటువంటి ఆదాయాలన్నీ కూడా తగ్గిపోయే స్థితి తటస్థించింది. మొత్తము కూడా కేంద్రీకరణ జరిగింది. కేంద్రీకరణ జరిగినప్పటికీ, కొంత వరకు ఆదాయాలు రాష్ట్ర ప్రభుత్వాలకు ఉన్నాయి. కాని ఈనాడు, నూతన రాజ్యాంగమే కాకుండా, ఈ Plnaning వచ్చిన తరువాత దాదాపు రాష్ట్రములో ఉన్నటు

Sri Vavilala Gopalakrishnayya [13th Augnslt 956

వంటి ఆదాయాలన్నీ తగ్గిపోయే టటువంటి పరిస్థితి వస్తున్నది. ఎందువల్ల నంటే ఇదిగో ఈ points మాకు ఇస్తే సరిపోతుంది అంటారు. దానితోటి ఈ అంతర్ రాష్ట్రీయ వివాదము వచ్చినపుడు, వాటిమీద Supreme Court ఇచ్చినJudgments లో రాష్ట్రాలకు ఆ అధికారము కూడా పోయింది. దీన్నిగురించి Taxation committee ఒక మాట చెప్పింది; మేము ఆలోచించాము, అంతర్ రాష్ట్రానికి ఉన్నటువంటి ఆదాయాన్ని ఒక రాష్ట్రానికి ఇవ్వడం న్యాయంకాదని, ఉదాహరణకు బొంబాయి రాష్ట్రము ఉన్నది; లేకపోతే ఢిల్లీ రాష్ట్రము ఉన్నది. ఢిల్లీ రాష్ట్రములో గుడ్డలమీద వచ్చేటటువంటి ఆదాయమున్నది. అక్కడ ఉన్నటువంటి గుడ్డలు పంజాబు రాష్ట్రము కొనుక్కోపోతుంది. U.P. రాష్ట్రము కొనుక్కోపోతుంది. బొంబాయి నుండి వచ్చేటటువంటి వస్తువులు ఢిల్లీలో అమ్మడానికి వచ్చినప్పుడు, బొంబాయి రాష్ట్రములో అక్కడ పన్ను వేస్తారు. తరువాత ఇక్కడ వచ్చినపుడు ఇక్కడా పన్ను వేస్తారు. అది మరల అక్కడకు పోయేటప్పటికి, అక్కడ Single point Tax కాకుండా Multi point tax ఉన్నందువలన, అక్కడ consumers మీద వరుసగా పడుతున్నది. ఈ విధంగా అయితే నష్టము వస్తుందేమోనని ఒక వైపు చెప్పుతున్నారు. రెండో ప్రక్క కేంద్ర ప్రభుత్వానికే వచ్చినట్లైతే రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదాయము తగ్గిపోయే స్థితి వస్తుంది. కనుక దీనిని ఏమి చేయాలో ఆలోచించామని చెప్పారు. కాని చివరకు కేంద్ర ప్రభుత్వము ఇది తీసుకోవాలని చెప్పారు, కనుక, ఈ జడ్జిమెంటు వీటి ఫలితంగా కేంద్ర ప్రభుత్వము ఇప్పుడు కూడ తీసుకొంటున్నది. తీసుకొంటే తీసుకోవచ్చు. కాని దేనిమీద వేస్తారు పన్ను అనేది నిర్ణయించ వలసి యున్నది. Cons itution ప్రకారం తినేటటు వంటి పథార్థముల మీద, ముఖ్యంగా essential articles జీవితావసర వస్తువుల మీద వేయకూడదు అని ఉన్నది. కాని మనము జీవితావసర వస్తువుల మీద కూడా వేసుకొంటూనే ఉన్నాము. ఉదాహరణకు నిన్న గాక మొన్న మన రాష్ట్రంలో ముఖ్యమైన ఆహార పదార్థమైనటువంటి బియ్యం మీద (వడ్లమీద) మొట్ట మొదటే Single point Tax వేశాము. ఇది వేయవచ్చునా, వేయకూడదా అనేది ఆలోచించినప్పుడు. మనము తీవ్రమైన పరిశోధనలో ఉండవలసి వస్తుంది. దానికి గాను కొన్ని articles చెప్పారు. అంతర్ రాష్ట్రపు వ్యవహారాలలో వచ్చేటటు వంటివి ఏవేవి ఉంటాయని చెప్పారో అవి పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు, భార్గవ మొదలగు ఇంకా చాలామంది దీన్ని చూస్తే మాకు భయం వేస్తుందని

చెప్పారు. ఎందువల్ల నంటే, అంతర్ రాష్ట్రీ వ్యవహారం అనే పేరుతోటి మీరు తక్కిన వాటి మీద పోతున్నారని చెప్పారు. మనకు తెలియకుండా పోతూ ఉన్నటు వంటి Act ఒకటి ఉన్నది అది Essential Commodities Act దాని ప్రకారం కొన్నింటికి వేయవచ్చు, కొన్నింటికి వేయకూడదు అని ఒక నిర్ణయము చేశారు. కాని ఈ Amendment Pass చేసిన దానితోటి, ఆ బిల్లు రద్దుఅయి పోయింది. దానిమీద వారు భయ పడ్డారుకూడ: ఒక ప్రాంతంలో కరువుగాని, లేక మొన్న సంభవించి నటువంటి విషాదకరమై నటువంటి వరదలు వచ్చినప్పుడు గాని, ఒక రాష్ట్రీమునుంచి ఇంకొక రాష్ట్రీమునకు ఆహార పదార్థములు పోవలసి వచ్చినప్పుడు దానిమీద పన్ను వేస్తారా లేదా అనే సమస్య ఉన్నది. పన్ను వేయడం అనేది అంతర్ రాష్ట్రీయ వ్యవహారము. కనుక ఆహార పదార్థముల మీద పడకుండా ఉండేటట్లు చూడడం అవసరం అనేటటువంటి అభిప్రాయము తోటి మొట్టమొదట ఈ Essential Commodities Bill వచ్చింది. ఆబిల్లు ఈ Amendment తోటి రద్దు అయిపోయిందని నాకు కూడ ఆ భయమున్నది. రేపు ప్రొద్దున ఇతర రాష్ట్రీలకు ఏదైనా వచ్చినప్పుడు, కేంద్ర ప్రభుత్వానికి ఆ రాష్ట్రీపు జవాబు దారీ ఏమీలేదు. వాళ్ళకు కావలసిందల్లా ఆదాయమే. అదాయము ప్రశ్న వచ్చినప్పుడు ఎవరికి వస్తుంది ? మాకు వస్తుందని మీరు అంటారు ఇది న్యాయమవుతుందా అని: అది వేయడానికి మాకు ఉద్దేశం లేదు అని చెప్పుతారు. అది చాలా సంతోషము. ఈ విషయములో కేంద్ర ప్రభుత్వ మంత్రులు ఉపన్యాసాలు చెప్పారు గాని ఆ point కు పట్టుకు జవాబు చెప్పకుండా తప్పించుకొన్నారు, ఇప్పుడు మీరు ఏ వేవో proceedings ఇచ్చారు. అవి రాత్రి మూడు గంటలవరకు కూర్చొని చదువు కోవడం జరిగింది. తెల్లవారి 5 గంటల వరకు చదివినా అర్థం అయ్యేటట్లు లేదు.

The Hon. Sri D. SANJIVAYYA :- ఈఆదాయాన్ని అంతా రాష్ట్రీ ప్రభుత్వాలకు పంచిపెడతా మన్నారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :- నేను అడిగిన Point అది కాదు....సాధారణముగా ఆహారపదార్థాలు వగైరా ఒక రాష్ట్రీంనుంచి ఇంకో రాష్ట్రీనికి వెళ్ళుతాయి వాటిమీద పన్నులు వేయడానికి వీలు లేకుండా ఉండే టట్లు ఒక Act ఉన్నది అది ఈ శాసనం ద్వారా రద్దు అయిపోతున్నది. అది రద్దు

అయినప్పుడు ఆ శాసనం ప్రకారం వేయకుండా ఉంటారా లేక దీంట్లో అవకాశం ఉన్నది గనుక వేటిమీదనైనా వేయవచ్చునని నిర్ణయిస్తారా ? అని కేంద్ర ప్రభుత్వము అడిగింది. అది వెయ్యాలనే నేను చెప్పేది దానికి జవాబు సరిగా చెప్పలేదు. వెయ్యాలనే ఉద్దేశం దీంట్లో ఉన్నది inherent గా ఉన్నది. కనుక దానిని తప్పించుకోడాని కేమైనా ఆవిధంగా అడిగారు. భార్గవా అనేటటువంటి దేశభక్తుడు. కాంగ్రెసు భక్తుడు కూడ ఆ విధానానికి తీవ్రమైన dissent 2½ పేజీలు వ్రాయవలసి వచ్చింది. ఇది రావడములో కొంత ఉపయోగము ఉన్నదని నేను ఒప్పుకొంటున్నాను. కాని దీంట్లో ప్రధానమైన నష్టమున్నది. దానిమీద వాళ్ళేమి చెప్పలేదు గాని మన మంత్రి గారు ఖచ్చితంగా చెప్పేశారు, దానిమీద మేము వేస్తామని.

The Hon. Sri D. SANJIVAYYA:- ఇటీవల దానికి Central Government వారు President గారు, assent ఇచ్చారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :- అవును, దానికి assent ఇచ్చిన మాట నిజమే, అది ఏవిధంగా ఇచ్చారంటే. ఏ రాష్ట్రమైన తమ రాష్ట్రములో ఉన్నటువంటి ఆహార పదార్థాలు వగైరాల మీద పన్ను వేయడానికి నిర్ణయించాలంటే ఆ Act అమాంతంగా రాష్ట్ర ప్రభుత్వంతో గవర్నరు తోటిసరిపోదు. అది మాకు వచ్చి కేంద్రప్రభుత్వములో రాష్ట్రపతి కూడా ఆమోదిస్తేనే వేసుకో వచ్చునని చెప్పారు. ఆ విధంగా ఆఅధికాకరం వాళ్ళ చేతులలో ఉంచుకొన్నారు గాని అడిగినప్పుడల్లా assent ఇచ్చేస్తున్నారు. ఆవిధంగా ఈ Essential Commodities Bill యొక్క ఉద్దేశమే ఎగిరి పోవడం జరిగింది. అందువల్ల మాకు assent ఇచ్చారు. మనముతీసుకొన్నాము. అందువల్ల Essential Commodities Bill గనుక దానివల్ల పోకపోయి నట్లయితే, ఇది జరిగి యుండదు. కనుక అట్లాంటి బిల్లు ఒకటి రావడమంటె, ఆహార పదార్థాలమీద, ముఖ్యంగా చాలా అవసరమైనటువంటి పదార్థాలమీద వేయకుండా ఉండడం అవసరమనే విషయము ప్రభుత్వము ఆలోచించ వలసిన అవసరమున్నది.

ఇకపోతే, ఈ ఆదాయము ఎక్కడ నుంచి వస్తుంది? ఎంత వస్తుందని ఎవరు నిర్ణయిస్తారు? ఈ ఆదాయాన్ని నిర్ణయించడంలో Administration లో చాలా చిక్కులు వస్తాయి అని చెప్పుతున్నారు, నిజమే మన రాష్ట్రము పారిశ్రామికంగా చాలా వెనుకబడి యున్నది. వ్యవసాయకంగా కొన్ని వస్తువులు తయారు చేస్తున్నాము

కాని ఈ తయారు చేసిన వస్తువులను ఇక్కడ ముడి పదార్థాలుగా అమ్ముకోవలసిందే గాని, వాటిని ఉపయోగ పడే వస్తువులుగా అమ్ముకోడానికి వీలులేదు. ఉదాహరణకు పొగాకు తీసుకోండి. దేశము మొత్తంమీద 95% పొగాకు మనము పండిస్తున్నాము. కాని దానిని ఇతర రాష్ట్రాలకు పంపించు కోవలసిందే. లేక దానితో చుట్టలు పెట్టు కోవలసిందే గాని, మనకు దాంట్లో వచ్చేటటువంటి ఆదాయ మేమైన ఉన్నదా అంటే లేదు. బియ్యంమీదనే పన్ను వేయడానికి నిర్ణయించి నటువంటి ప్రభుత్వము, పొగాకు ఇతర రాష్ట్రాలకు పోయేటపుడు వారి దగ్గరనుంచి ఏమైన వచ్చేటటువంటి ప్రయత్నం చేస్తున్నదా అంటే లేదు. ఈవేళ రాష్ట్రప్రభుత్వం గాని, కేంద్రప్రభుత్వం గాని ఈ నిర్ణయం తీసుకొంటుందా అని అడుగుతున్నాను. Excise పన్ను వేశా మని అంటున్నారు. Excise పన్ను వేసి ఉండవచ్చు, కాని Excise పన్ను కాకుం డా ఇక్కడ నుంచి ముడిపదార్థాలు వెళ్లి, ఆ ముడి పదార్థాలను finished goods గా తయారు చేసే టటువంటి వాటిమీద వేసేటటువంటి పన్ను ఉన్నదా అంటే లేదు. కాని బియ్యము మాత్రము ఒక రాష్ట్రంనుంచి ఇంకొక రాష్ట్రానికి వెళ్ళేటప్పుడు ముందే కొనుక్కొని కూర్చుంటుంది. ఏ రాష్ట్రమైతే ఎగుమతి చేస్తుందో అది. అందువల్ల ఆవిధంగా వచ్చేటటువంటి నష్టం గురించి ఆలోచించ వలసి యుంటుంది. వాళ్లు చెప్పింది —" The following goods should be specified in the Central Legislation" అని చెప్పారు. ఇప్పుడు మనము చేస్తున్నది Central Legislation కాదను కోండి. పార్లమెంటు శాసనాన్ని చేయడానికి అధికారం మాత్రం ఇస్తున్నాము అనేది, నాకు గుర్తు ఉన్నది, అందువల్ల వారు చేయగలిగింది కూడా బొగ్గు, ఇనుము, ఉక్కు, దూది, చర్మాలు, నూనెలు, జనపనార, వీటిమీద.

The Hon. Sri D. SANJIVAYYA:-అక్కడ చెప్పలేదు.ఇప్పుడేమో అన్నారు "Inter State articles other than newspapers" అని ఈ "other than news papers" అనేవి ఏవేవో specify చేయలేదు. specify చేస్తారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:_నేను చెప్పినదేమి టంటే, Taxation Committee వారువీటిమీద వేస్తే బాగుంటుంది. ఈ అధికారము మీకు ఉంటే బాగుంటుందని చెప్పారు, కనుక వాళ్లు అది నిర్ణయిస్తారా? లేకపోతే ఇంకొక జాబితా ఉన్నదని, దాంట్లో ఇవన్నీ కూడ వేయాలని ఆలోచించారని చెప్పు

టున్నారు. ఇది నిర్ణయిస్తారా? ఈ రెంటింటిలో ఏది జరుగుతుందో తెలియదు, రెండవది దీనిమీద వచ్చే ఆదాయము వారికి పోతుంది. అనేటటువంటిది ప్రధానమైన విషయము. దీనిని ఎవరు వసూలు చేస్తారు? కేంద్రప్రభుత్వము వసూలు చేసేదానికి, వారి అధికారులు ఇక్కడ లేరు. ఒకవేళ factoriesలో పెట్టినప్పటికీ దుంపనూనెలుపైన excise పన్ను వసూలు చేసేదానికి మాత్రమే వాళ్ల staff పెట్టుకొన్నారు. అదే విధంగా Sales Tax వసూలు చేసే దానికి వాళ్లు staff పెదతారా అంటె పెట్టలేరు. అని Txation Committee కూడా చెప్పింది; ప్రభుత్వము చెప్పింది; అనుభవములో కూడ అదే వస్తున్నది. అయితే అది వసూలు ఎవరు చేయాలి? ఏరాష్ట్రానికి ఆరాష్ట్రము వసూలు చేసి వాళ్లకు మూట గట్టిపెడితే ఆ మూట లోనుంచి మన మీద వారికి దయఉంటె కొంతఇస్తారు. అది ఎంత ఇస్తారనేది ఖచ్చితంగా దీంట్లో ఎక్కడలేదు. ఇందుకు సంజీవయ్య గారు అది మనకే వస్తుందని చెప్పుతున్నారు. అది నిజమైతే ఏ proportion లో వస్తుందని నాప్రశ్న.

(At this stage Mr. Deputy Speaker occupied the Chair)

ఇప్పుడు యిందులో ఒక ప్రశ్న ఉన్నది. బొంబాయి రాష్ట్రంనుంచి మద్రాసు రాష్ట్రం నుంచి మనము గుడ్డలు తెప్పించుకుంటున్నాము. మనము single point tax కాకుండా multi point tax గుడ్డలమీద పన్ను వేస్తున్నాము. కనుక యీ మాదిరిగా ఎన్ని చోట్లకైతే ఆ బట్ట పోయిందో, ఆ అన్ని చోట్లలోనూ మనము పన్ను వేస్తున్నాము. అక్కడినుంచి వచ్చేటప్పుడు ఆ డబ్బు ఎంత ఉన్నదో దానికి లెక్కలు లేవు. కాబట్టి ఆ డబ్బుయొక్క ప్రయోజనము మనము పొందాలి అంటే, single point tax యే చాలా బాగా ఉంటుందని అందరము అంటున్నాము. Single point tax మనకు చెందేటప్పుడు, వారు అక్కడ purchase tax న్నా యిక్కడికి రాగానే మనము sales-tax వేస్తే, ధర పెరిగే ప్రమాదము ఉన్నది కాబట్టి హెచ్చరికగా ఉండండి అని Taxation Enquiry Committee వారు చెప్పారు. కనుక దీన్ని ఎట్లా మనము సర్దుకుంటాము? Single point tax వేయటానికి మనము నిర్ణయించుకున్నప్పుడు, యితర రాష్ట్రములలోని లెక్కలు ఎట్లా తేలుతాయి? ఏ రాష్ట్రమునుంచి ఏ రాష్ట్రానికి ఎగుమతి చేశారో తెలియటానికి వీలుండదు. మోటారు కార్లలోనో, యింకా చిన్న చిన్న బండ్లలోనో సాధారణముగా యీ సరుకు అంతా ఎగుమతి చేయరు. రైళ్ళలోనే ఎగుమతి చేస్తారు కాబట్టి, రైల్వేవారివద్ద ఆ export లెక్కలన్నీ తేలటానికి వీలుంటుంది. కనుక అక్కడ ఉన్న ప్రభుత్వానికి ఆ

వస్తువులుకూడ ఏమిటో అవికూడ తేలుతాయి. ఏ ఏ రాష్ట్రములనుంచి ఏ ఏ రాష్ట్రాలకు పంపించే సరుకులు ఎట్లా తయారుచేసి, ఎట్లా పంపిస్తున్నదిన్నీ, దానికి సంబంధించిన లెక్కలు ఆయా దేశములనుంచి వచ్చే డబ్బులో భాగమో, అంటే దానిలో మన వైపుకు వచ్చే ఎగుమతి ఎంత ఉన్నదో, ఆ ఎగుమతికి సంబంధించిన డబ్బు మనకు యిచ్చినప్పుడే పారిశ్రామికంగా వెనుకబడ్డ రాష్ట్రాలకు ఉపయోగ పడగలవు. లేకపోతే ఉపయోగ పడవు అని అంటున్నాను. అందువల్ల నేను ప్రభుత్వాన్ని కోరే దేమిటంటే, మన రాష్ట్ర ప్రభుత్వం దీన్ని ఒప్పుకుంటునప్పుడు, యీ ప్రభుత్వం ఒక్క విషయములో మాత్రము కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయాలి. అది ఎట్లాగంటే, పొగాకు మీద యిచ్చేటప్పుడు, అది ఏ బెంగుళూరుకో, ఏ హైద్రాబాదుకో-అయితే హైదరాబాదుకు మనము వెళ్లుతున్నాముగనుక యిక హైదరాబాదు విషయము మన కంతగాబాధ ఉండదు అనుకొండి-యిందులో ఢిల్లీకి కొంత, ఎక్కువ భాగము కలకత్తాకు పంపబడుతున్నది. కలకత్తాకువెళ్ళే పొగాకుమీద ఏ విధంగా మనము డబ్బు వసూలు చేయటానికి వీలు అవుతుందో, అది ఆలోచించవలసిన సమస్య. అది యీ రాష్ట్ర ప్రభుత్వం, Sales-tax Enquiry Committee వారు ఆ విషయమే ఆలోచించుతున్నది. కాని యితర విషయాలు అన్నీ సమగ్రంగా ఆలోచించారు. దానికేమీ అనుమానం లేదు. ఈ విధముగా పోయిన దానిమీద Inter State Tax వచ్చినప్పుడు, దానిని ఎట్లా లాగుకుంటాము అని ఆలోచిస్తే, అది కాస్తా excess అయిపోతుంది. ఇది అంతా చేయిజారి పోయిన తరువాత అక్కడ production కు వెళ్ళినట్లయితే, అక్కడ అది ఉత్పత్తి అవుతూ ఉంటే, (interuption)

The Hon. Sri D. SANJIVAYYA :-States కు అధికారము లేదు కాబట్టి, వారు ఆ విషయము ఆలోచించ లేదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :- ఆ సంగతి నేను ఒప్పుకుంటాను. States కు అధికారము లేని మాట నిజమే. States కు అధికారము లేదు కాబట్టే వారు ఆలోచించ లేదని చెబుతున్నాను. States కు యిదివరకు ఉన్న అధికారమును యీ రోజున కేంద్ర ప్రభుత్వానికి అప్ప జెబుతున్నాము. ఆ మాదిరి యిచ్చే అధికారమును వారికి యిచ్చే ముందు, యీ విషయము ఏమి చేస్తామని State Government అయినా ఆలోచించలేదు. మనకు డబ్బు వస్తుందని చెప్పారు, వారుకూడ ఆ మాటే చెప్పారు కూడాను.

Mr. DEPUTY SPEAKER :- ఆ విషయాలన్నీ Sales-tax Bill వచ్చినప్పుడు మాట్లాడవచ్చులెండి. ఇప్పుడు సభ ఎదుట ఉన్న విషయమును గురించి మాట్లాడండి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :-"The State imposing it on behalf of the Central Government should retain only such portion of it as represents receipts from the tax at the rates fixed for inter-state trade between registered dealers and make over the excess receipts if any to the States which have received the goods in the course of such trade. This is necessary: firstly to prevent the avoidance of sales-tax by dealers and some others; and secondly to ensure that a part of the receipts from the tax on such transactions also accrues to the States to which the goods have been sent." అనీ ఉన్నది. కాబట్టి నేను చెప్పేది ఏమిటంటే, యీ లెక్కలు తీసేటప్పుడు మనకు వచ్చే డబ్బులో మనకు భాగం వస్తుందా అని మంత్రిగారిని అడుగుతున్నాను. వారు వసూలు చేసే డబ్బు యితర రాష్ట్రాలలో ఉన్నదానినైనా మన State లో consumptionకు పంపించిన దానిలో మనకు భాగము మాత్రమే వస్తుందా ? లేకపోతే మన రాష్ట్రానికి ఎంత పంపించారో ఆ మొత్తము అంతా కూడా మనకే యిస్తారా ? ఆ సంగతి మాత్రము చెప్పవలసిన అవసరము ఉన్నది.

మరొక విషయము మనవి చేస్తున్నాను. ఈ విధముగా రోజురోజుకు రాష్ట్రములకున్న ఆదాయములు అన్నీ అయిపోయిన తరువాత, రాష్ట్రములన్నీ Unitary States అయి పోతాయనే భయముకూడ ఉన్నది. అది మనము చాలా తీవ్రంగా ఆలోచించవలసిన విషయము అయి యున్నది. Planning వచ్చిన తరువాత, మనకు అన్నీ వారు conditions పెడుతున్నప్పుడు, అవి అన్నీ మనము ఒప్పు కున్నప్పుడు, రాష్ట్రాలకు ఉన్న స్వతంత్రము ఏది ఉన్నదో, రాష్ట్రాలకు కావలసిన ఆర్థిక విధానము ఏది ఉన్నదో అది అంతా కూడా ఏపూటకాపూట కేంద్ర ప్రభుత్వం యొక్క దయాదాక్షిణ్యం మీద ఆధారపడ వలసి వస్తున్నది. మన రాష్ట్రము లో ఇప్పటికీ చాలా ఎక్కువగా పన్నులు వేశారని అనుకుంటున్నాము ఇంకా వేయాలనే అనుకుంటున్నారు. ( Interruption ) లేదు అని అంటున్నారు మన గోపాలరెడ్డి

గారు. కాని పన్ను వేస్తే State లో వచ్చే ఆదాయాన్ని కాస్తా వారు తీసుకొని పోతున్నారు. వారి ఆదాయము మీద, ఉన్న ఆదాయంమీద పన్నులు వేసి లాగవలసి వస్తున్నది. ఇది ఎట్లా ఉన్నదంటే, ఎండిపోయిన ఆవును పాలు పితికితే రక్తము వచ్చినట్లుగా, రాష్ట్రములో ఉన్న sources అన్నీ అయిపోయిన తరువాత యింకా లాగటానికి చూస్తే రక్తము తప్ప మరేమి రాదు. మంచి పొదుగు ఉంటే. అందులోని పాలు కొద్దిగా ఉంటే, ఆ కొద్ది పాలు గూడ పితికి కేంద్ర ప్రభుత్వం పిప్పూటలా పూట తీసుకుని పోతున్నది. అందువల్ల వచ్చే ఆదాయము అంతా కేంద్ర ప్రభుత్వం తీసుకుని వెళ్ళేటప్పుడు అసలు మనకు యీ విషయములో వచ్చే ఆదాయము ఎంతో మంత్రిగారిని చెప్పమని అడుగుతున్నాను. ఈ బిల్లు ద్వారా వారికి అధికారము యిస్తున్నాము. ఇవ్వకపోయినా, ఆ అధికారము వారు తీసుకుంటానే యున్నారు. ఇది Concurrent subject కాబట్టి మనలను ఒప్పుకోమని చెబుతున్నారు. అంటకంటే ఏమిలేదు. ఒప్పుకోక పోయినా ఒప్పుకున్నట్లే లెక్క. (Interruption) ఇది యిదివరకు State List లో ఉన్నది. కొంత భాగము Central List లో ఉన్నది. ఇది మొత్తము తీసివేసి అంతా కూడ Provincial list లో పెట్టుతున్నాము. ఈ రోజున ఎందుకు ఒప్పుకుంటున్నామంటే, యిది ConcurrentList కాదు. మనము వారికి hand over చేస్తున్నాము గనుక సంతకము చేసి ఉన్నాము. అందువల్ల మనము యీ విషయములో చాలా తీవ్రంగా ఆలోచించవలసిన అవసరమున్నది. కాదు అని చెప్పటానికి. అవును అని చెప్పటానికి ఏమీలేదు. వీలుఅయితే oppose చేయవచ్చును కాని ప్రయోజనము మాత్రము నిష్ఫలం అనిఅంటున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA :- ఈ పుస్తకము లోనిది సభ వారికి చదివి వినిపిస్తున్నాను. ఇది అందరికి అందిందని అనుకుంటున్నాను.

" Broadly therefore inter-State sales should be the concern of the Union, but the responsibilities pertaining to the Union should be exercised through the State Governments and in any case, the revenue should appropriately devolve on them.' అని ఉన్నది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :-అందువల్ల నేను మనవిచేసేది యేమిటంటే, అది మనకు అంతా యిస్తామని అంటున్నారు. ఎందు

కంటే, నాకు ఒక doubt తోస్తున్నది. వారు ఖర్చులు మన నెత్తిన వేస్తారో లేక పోతే మన ఖర్చులు వాళ్ళ నెత్తిన వేస్తారో అదేమి తెలియడము లేదు. ఆ పాయింటు మాత్రము కనుక్కోవాలని అంటున్నాను. ఆయా రాష్ట్రాంలో వచ్చే డబ్బు మన రాష్ట్రమునకు వచ్చే వస్తువుల మీద అది వస్తువుల లెక్కలలో వేసి యిస్తారో, లేకపోతే వారి లెక్కలలో వేసుకుంటారో, అది తేల్చవలసి యున్నది. అది తేల్చినప్పుడే మన ఆంధ్ర రాష్ట్రమునకు ఉపయోగ పడుతుందని చెబుతూ విరమిస్తున్నాను.

Sri R. B. RAMAKRISHNA RAJU:- Sir, I heartily support this motion moved by the Hon.Minister. I know as a matter fact, our State is losing a great deal of income on account of this inability to tax inter-state commerce. As a result of the recent decision of the Supreme Court what is happening between Madras and Chittoor, I know is, that a number of motor-cars which are being sold actually in Madras avoid the sales-tax there and the delivery is made in Chittoor, so much so, almost all the new cars that are being purchased in Madras nowadays bear the registration mark of ADC i. e, Chittoor, because if delivery is made in Chittoor in accordance with the decision of the Supreme Court, our State is not able to impose any tax upon that, I am sure our State is losing an apperciable sales-tax. At the point of delivery, we are not able to tax it and they are not able to tax there and so cars are going away without paying any sales-tax. It is a loss both to that State and to our State. So this amendment seeks to prohibit such kind of evasion of sales-tax. To that extent, it ought to be welcomed and I heartily support it.

In this connection, I will just read the speech of Dr. Krishnaswami in the Parliament. He was speaking on behalf of the State and so I refer to two points raised by him. There under clause 3 (3) Parliament may by law formulate principles for determining when a sale or purchase of goods takes place in the course of inter-State trade or commerce. Referring to that he says:

" For the first time in the history of this country, we have attempted to say that a certain item should be entered in

the Union List and Parliament should have the power to determine the scope and extent of the item. ...... What will happen is that one fine morning Parliament may take it into its head to poach on the preserves of the States and say that even intra-State trade is inter-State trade."

For instance a car in Madras sold by a man there is brought and delivered here. If we have the power to collect tax on that motor-car, we get the tax straight away into our hands. But if it is called inter-state trade, it goes into coffers of the Union and they will have to distribute it according to the principles formulated by them, because we find they can formulate principles of collection as well as distribution. So if it is intra-State, we will have the power to tax the car straight away, but if it is inter-State, it goes to them and then only we must get from them according to the principles laid by them. This is one point. These are the two points raised by him, whether it becomes intra-State trade or inter-State trade and what are the principles on which the distribution will be made by the Centre? He states that the individual States must be very careful and asks them to consult us before they formulate these principles not only of decision about the kind of trade but also matters in dispute. I am sure the Hon. Minister had readit and if he has not done so, I request him to read it and see that suitable representations are made to the Central Government in this behalf.

Sri PILLALAMARRI VENKATESWARLU:- అధ్యక్షా, ఇప్పుడు మనము Constitutional amendment చర్చిస్తున్నాము. దానివల్ల మంత్రి గారు చెప్పిన ప్రకారము ఇప్పటివరకు freeze అయినటువంటి Sales tax మనము పొందడానికి వీలుఉంటుంది. అందులో 50 లక్షల రూపాయలు ఇతర రాష్ట్రాలనుండి రావలసిన మొత్తం ఉండిపోయింది. దానిని పొందడానికి కొన్నిఆటంకములు వచ్చాయి. అమెండుమెంటువల్ల ఈ ఆటంకములు తొలిగిపోతవి అని అన్నారు. గాని 1956 సంవత్సరంలోనే Sales Tax Validating Bill Parliament లో ప్యాసు అయినది. అది ప్యాసు అయిన తరువాత మనకు రావలసిన 50 లక్షల రూపాయలు ఎందుకు రాలేదు? దీనికి ఆటంకాలు further గా ఎందుకు వచ్చాయో తెలియ చెయ్యలేదు. దానికికారణము ఈ amendment లేకపోవడమే అంటున్నారు.

(2) Ratification of the amendments to the Seventh Schedule to and Articles 269 and 286 of the Constitution of India.

13th August 1956

The Hon. Sri D. SANJIVAYYA :- Ordinance pass అయిన తరువాత ఓరేపసూరు చేసుకోవచ్చును అని అన్నారు దానికోసం further staff వేసినాము.

Sri PILLALAMARRI VENKATESWARLU:- మన అన్ని చిక్కులను పరిష్కరించు కొనేందుకు ఈ Validating laws సరిపోయేది అనిస్పష్టంగా తెలుస్తున్నది,

The Hon. Dr. B. GOPALA REDDI:- నేటివరకు జరిగినదానికి Validating చట్టము, further గా జరుగబోయే దానికి ఇది కావలెను. ఈ principle ను కొంచెం extend చేస్తే ఒకవేళ ఈ purpose నెరవేరేదేమోనని నాఉద్దేశము.

Sri PILLALAMARRI VENKATESWARLU:-ఇప్పటికే మనరాష్ట్ర శాసనసభలకుగాని ప్రభుత్వానికిగాని ఉండే అధికారాలుచాలా తగ్గించబడుతూ ఉన్నవి. ఈ amendment pass అయిన తరువాత మనకు ఉన్నకొద్దిపాటి అధికారాలుపోయి ఇంక మన చేతులలో భూమిశిస్తు, Motor Vehicles Tax మాత్రము మిగిలే ప్రమాదము ఉన్నది అని ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాక తప్పదు. పార్లమెంటు proceedings చూచినా, Union Minister speeches విన్నా, సభ్యుల ఉపన్యాసాలు విన్నా కలిగిన అభిప్రాయము ఏమిటి, ఈ రోజున States చేతులలో నుంచి sales tax వేసేఅధికారం తీసివేయాలని, తగ్గించివేయాలనే, భావము ఖచ్చితముగా అగుపడుతుంది, అసలు కొన్ని Articles మీద Finance Commission Report గాని Taxation enquiry committee గాని ఈ Amendment చర్చించినప్పటి ధోరణి చూస్తే వారిదృష్టి స్పష్టముగా తెలుస్తుంది. ప్రత్యేకముగా industrial goods మీద industries కు commerce కు సహాయంచేయడానికి వీలుగా ఈ amendments తీసుకొని రావలెను అనేధోరణి ఉన్నదని తెలుస్తుంది. Industries కు ఉపయోగపడే raw materials మీద పన్నువేస్తే ధరలు విపరీతముగా పెరగవచ్చును కాబట్టి వెయ్యకూడదు. అయితే తయారైన గుడ్డమీద అదే రకమైన నిబంధనలు పెట్టి దానిని తగ్గించి అంతా ఒక సూత్రంగా ఒక certified plan గా అంటే మనము అంగీకరింప వచ్చును. గాని అట్లాలేదు. ముఖ్యంగా

Sri Pillalamarri Venkateswarlu) (13th August 1956

వెనుకబడిన రాష్ట్రాలనుంచి ముడిసరకులు పోతాయి కాబట్టి వాటిమీద వేసేపన్నులు industrialists మీద పడతాయి కనుక jute మీదగాని, మనరాష్ట్రమునుంచి ఎగుమతి అయ్యేధాన్యం మీద గాని పన్నువేస్తే వారికి నష్టం. గోపాలరెడ్డిగారికి అధికారము లేదు కనుక jute మీద 0-0-3 తో ఉండిపోయింది. మనరాష్ట్రంలో మన ప్రజలమీద ఎంతపన్ను అయినా మనము వేసుకోవచ్చును. కాని మనరాష్ట్రంలో నుంచి పోయేధాన్యం మీద ( inter-State వ్యాపారంకనుక ) ఇతర వస్తువులమీద అనుకున్న tax వెయ్యడానికి వీలులేదని ఈ amendment వల్ల తెలుస్తుంది. ఈనాడు మనకున్న కొద్దిపాటి resources ఇంకా తగ్గించ బడుతున్నవి అన్నమాట. ఇవన్నీ States మధ్య పంచుతామన్నారు. అయితే ఏ principles మీద పంచుతారు. మన ధాన్యం ఇక్కడ అమ్ముతున్నాం అక్కడవారు కొంటున్నారు. ఈ రెండు states కు ఉన్న వివాదం ఏవిధముగా పరిష్కారముచేస్తారు అనేవిషయము ఈ బిల్లులో ఏమిచెప్పలేదు. అదే విధముగా jute విషయముకో కూడా ఏమిచెప్పలేదు. దేశముఖ్గారి ఉపన్యాసములో ఇతర రాష్ట్రాలకు అవసరమైన food stuffs అన్నింటిని చేరుస్తామన్నారు. గుడ్డ చెర్చబోతారా అంటే లేదు. cotton, jute, coal, iron ఇతర ముడి పదార్థాలను అయినా చేర్చరు. తయారైనవస్తువులను చేర్చడానికి ఏ విధమైన indication లేదు. ఆనాటి పార్లమెంటు discussion చూస్తే ఇది చేస్తారని ఆశకలగడానికి ఏవిధమైన ఆస్కారము లేదు. ఇందువల్ల స్పష్టమయే విషయము ఏమిటంటే ఈ రోజున వెనుకబడిన ప్రాంతాలనుంచి పారిశ్రామికులకు తక్కువ ధరలకు సరకులు అందించడానికి ఈ బిల్లు తీసుకొని రా బడు తున్నదని స్పష్టముగా మనకు బోధపడుతుంది, దానిని మనము దృష్టిలో ఉంచుకొన వలెను. ఈ రోజున Constitutional amendment బిల్లు pass చేస్తున్నారు ఏ సూత్రాలమీద మీరు....

The Hon. Dr. B. GOPALA REDDI:- The Parliament passed an Act in 1952 declaring a number of goods like food stuffs of various kinds, cloth, raw cotton, cattlefeeds, iron and steel, coal etc.,

Sri PILLALAMARRI VENKATESWARLU:- Essential Commodities Act దానితో రద్దు అవుతుంది. దానితో ఆ Act ఉండదు. ఇది పార్లమెంటులో వచ్చినప్పుడు ఆ ఆదాయాన్ని ఏ proportion లో పంచుతారో చెప్పలేదు. ఇతర రాష్ట్రాలకు అవసరమైన వస్తువుల మీద కేంద్రప్రభుత్వం control చెయ్య దలచు కొన్నది. అలాంటప్పుడు ఏ సూత్రాలను బట్టి ఏ వస్తువుల

ను Essential Commoditiesగా నిర్ణయించ బోతున్నారో తెలియదు. ఏవి ఇంకా చేర్చబోతారో తెలియదు. వారి ఇష్టము వచ్చిన వస్తువులను మన చేతిలోనుంచితీసు కొనడానికి కేంద్రప్రభుత్వానికి ఒక blank cheque వ్రాసి ఇస్తున్నామనే విషయం మరచి పోకూడదని మీ దృష్టికి తీసుకవస్తున్నాను.

తర్వాత inter-State అని చెప్పుతున్నారు ఇక్కడ నుంచి కొనుక్కొని పోయి ఇతర రాష్ట్రంలో అమ్మే సరికి inter-State ఔతుందా? మన రాష్ట్రంలో కొనే వ్యక్తి దగ్గరనుంచి Sales Tax వసూలు చేసేందుకు అవకాశము లేకుండా పోతుంది, ఇది మాత్రం నాకు ఏవిధంగానూ బోధ పడడంలేదు. సంజీవయ్యగారు దీనిలో ఒక point చెప్పారు. ఇతర రాష్ట్రాలలో నుంచి ఒక వ్యక్తి వచ్చి మన రాష్ట్రంలో కొనుక్కొని పోయిన తర్వాత ఆవ్యక్తి ఇతర రాష్ట్రాలకు సంబంధించి నటువంటి అతను కనుక Consumers ఇతర రాష్ట్రాలలో వున్నారు, కనుక మనము అతనిపైన Sales Tax వేయడానికి వీలులేదని ప్రస్తుత amendment తెలియజేసింది. మన రాష్ట్రంలో కొన్నప్పుడు దానిమీద ఎందువల్ల Sales Tax వేయడానికి వీలులేకుండా పోయిందో నాకు బోధ పడడం లేదు. Purchase మన రాష్ట్రంలో జరిగినపుడు దానిపైన Sales Tax వేయడానికి ప్రయత్నం చేయాలి. లేకపోయినట్లైతే మనకు ఎక్కువ నష్టము వచ్చే ప్రమాద ముందని నేను అనుకుంటున్నాను. తర్వాత దీనిలో amount నిర్ణయించేటపుడు మన రాష్ట్రాలను సంప్రదిస్తారా? లేదా? సంప్రదించే అవసరం వుందా, లేదా అంటే పార్లమెంటులో pass అయిన చట్టం ప్రకారం సంప్రదించ వలసిన పని ఏమాత్రం కూడా లేదు. అందువల్ల ముందే మీ అభిప్రాయం తెలియజేయ వలసియున్నది. ఫలానా వాని మీద మీరు వేసుకోడానికి వీలులేదు అని గట్టిగా చెప్పవలసిన అవసరముంది, దానిని మాత్రం మనం దృష్టిలో పెట్టుకోవాలి. తర్వాత ఎంత మొత్తానికి Tax వేయాలనే దానిలో కూడా మనకు voice వుండాలనే విషయం స్పష్టంగా చెబుతున్నాను. యీ రోజున ముడి iron వుంది. అది ఇక్కడినుంచి పోతుంది. దాని మీద మనకు Sales taxవేయ డానికి వీలులేకుండా ఉంది. ఇక్కడనుంచి పోయేవాటి పైన మనము Sales taxవేసే హక్కు కనుక పెట్టుకున్నట్లైతే immediate గా మనకు revenue రావడానికి వీలు వుంటుంది. కేంద్ర ప్రభుత్వము యీ Sales Taxను వసూలు చేసుకోడానికి అవకాశమిచ్చి, మార్గాలు ఆలోచించేది పోయి, కేంద్ర ప్రభుత్వం పూర్తి అధికారం తీసుకోవడము యేమాత్రము సమంజసంగా లేదని మేము

అనుకుంటున్నాము. అందువల్ల యీ సవరణను దూరదృష్టితో చూచినట్లైతే మన కున్న అధికారాలను సంకుచితపర్చడానికి మాత్రమే వారికి ఉపయోగపడుతుంది. యీ విధంగా మనకు వచ్చే ఆదాయం కూడా తగ్గి పోవటానికి అవకాశముంది. అందువల్ల యీ రెండు విషయాలను దృష్టిలో పెట్టుకొమ్మని తెలియజేస్తు న్నాను. మరొక విషయం చెప్ప దలుస్తాను. 1952-53 సంవత్సరములో రాష్ట్ర Finance Ministers ను అందరినీ Conference కు పిలిచారు. పిలిచి ఆరోజు యీ చట్టము చేయడానికి పూనుకున్నారు. పూనుకుంటే దూరదృష్టి కలిగినటువంటి ఆనాటి మద్రాస్ ముఖ్యమంత్రిగా వున్నటువంటి రాజగోపాలాచారి గారు దానిని అమలు లోనికి రానివ్వకుండా అడ్డు పడ్డారు. ఆయన అడ్డము పడడంవల్ల ఆ నాడు అది ఆగిపోయింది. యీనాడు తిరిగి దానిని ప్రవేశపెట్టుతున్నారు. వారు మీ "Stateకు లాభము కలుగజేయడానికే తీసుకొచ్చి పెట్టుతున్నామని" చెప్పుతున్నారు. అదే వారి ఉద్దేశమైతే ఇతర రాష్ట్రాలలో పసూలయ్యే డబ్బును సంపాదించడానికి వేరే మార్గాలు ఆలోచించాలే కాని మనకు వుండేటటువంటి యీ అధికారాన్ని సంకుచిత పర్చడము మాత్రము ఏవిధంగానూ సబబుగా లేదనే అభిప్రాయం పూర్తిగా కల్గు తుంది. అందువల్ల యీ విషయములన్నీ కూడా దృష్టిలో పెట్టుకోవాలి. పారిశ్రామిక వేత్తలు పార్లమెంటులో చేసిన ఉపన్యాసాలు అన్నీ చూస్తే రాష్ట్ర ప్రభుత్వాలు Raw materials పైన ఎక్కువ Tax వేశారు. అందువల్ల వాటిమీద Sales tax వేసే అధికారం కూడా లేకుండాచేయాలనే విధంగా వచ్చినాయి.

అక్కడ వున్న కేంద్ర మంత్రులు కూడా సరియైన సమాధానము చెప్పలేదు. యీపాటి కొద్ది సౌకర్యాలను కూడా వదలుకోవద్దని వదలుకున్నట్లైతే మన రైతుల మీదనే పన్నులు పెంచుకోవలసిందే కాని అంతకన్నా మనకు వేరే Source లేదు. యీనాడు మనము Pass చేయబోతున్న Amendment మీరు అనుకొన్నట్లు కేవలము లాభాలను దృష్టిలో పెట్టుకొని మన రాష్ట్రాలను బాగుచేయడానికి తీసు కొచ్చిన Amendment కాదు. ముఖ్యంగా మనముSales tax వేసేటటువంటి అధి కారాన్ని మనము పోగొట్టుకుంటున్నాము. పారిశ్రామికులను Commercial magnates ను దృష్టిలో పెట్టుకుంటే తక్కువ Saels tax వచ్చే ప్రమాదమున్నది. ఉదాహరణకు Jute విషయంచూడండి. Jute నుంచి ఇంతరాబోతుందనే అంచనా ఏమిలేదు. ఇవన్నీ మనము దృష్టిలో పెట్టుకున్నపుడు తప్పనిసరిగా మనము దానిని ఆమోదించినా సరే మీరందరుకూడా ప్రభుత్వ పక్షానికి చెందినవాండ్లు, ఆచరణలో

దానివల్ల వచ్చే దుష్ఫలితాలను దృష్టిలో పెట్టుకొని దుష్ఫలితాలు రాకుండా వుండే టట్లు జాగ్రత తీసుకుంటారని ఆశిస్తున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA:- అధ్యక్షా. గౌరవనీయులైన శాసన సభ్యులు చేసినటువంటి సూచనలలో ప్రధాన మైనవి 1, 2 మాత్రమే కన్పిస్తు న్నాయి. మొదటిది మనకు ఏదో అధికారం వున్నట్లు Inter-State sales మీద ఏదో పోతుందనే విధంగా కొందరు మాట్లాడారు. మనకు అధికారము లేదని Supreme Court చెప్పింది. అందుచేత Inter-State transactions మీద Sales Tax collect చేయాలనేది ప్రధానమైన సమస్య. ఆకారణం చేతనే యీ సవరణ తేబడింది, ఈ State list లోనుంచి union list లో చేర్చడము జరుగుతుంది. ఇక డబ్బు వసూలు ఎవరు చేయాలనే ప్రశ్న ఉద్భవించినది. అది రాష్ట్రప్రభుత్వాల ద్వారానే వసూలు చేయడానికి నిశ్చయము జరిగిందనినేను తెలియ జేస్తున్నాను, ఆతర్వాత వసూలైన మొత్తాన్ని రాష్ట్రాలకు పంచాలనే విషయం అక్కడ రివెన్యూశాఖామాత్యులుగా వున్న మనిలాల్‌షాగారు చెప్పి వున్నారు. ఆవాక్యమును నేను చదివి వినిపించిన తర్వాత కూడా కొందరు సభ్యులు వస్తుందా, రాదా? వస్తే ఎంత వస్తుంది? ఏదో నష్టము కల్గుతుందనే విధముగా మాట్లాడితే నేనేమీ చెప్పలేను. ఆ వాక్యాన్ని బాగా అర్థము చేసుకోలేదని అనుకుంటున్నాను.

Sri. PILLALAMARRI VENKATESWARLU:- మంత్రిగారుసరిగా అర్థము చేసుకొని అర్థమయ్యే టట్లు మాకుకూడా చెప్పమని కోరుతున్నాను. దానిలో

Although they will be levied and collected in accordance with the Act of Parliament అని ఉన్నది.

The Hon. Sri. D. SANJIVAYYA:- 'Parliament by law' చేసింది అంటున్నారు. ఈ పన్ను మొత్తం Consolidated fund క్రిందికి పోదు. రాష్ట్రాలకు పంచుతారు. ఐతే ఏఏ రాష్ట్రానికి ఎంత యివ్వాలనేది వారే నిర్ణయిస్తా మన్నారు. నిర్ణయించే దానికి ముందుగా మేము యీ పద్ధతి మీద నిర్ణయిస్తే బాగుంటుంది లేకపోతే Taxation Enquiry Committe వారు చెప్పినటువంటి సూత్రాలు వున్నాయి. జనాభాను బట్టి కొంత, ఇంకొక విషయాన్ని బట్టి కొంత నిర్ణ యించ మన్నాము. ఆ విధంగా సిద్ధాంతాలు ఏవైతే ఏర్పాటు చేయబోతున్నారో ఆ సిద్ధాంతాల copy సభ్యులకు చూపించి వున్నాము. ఆమోదాన్ని కూడా తీసికొని

రాష్ట్రాలన్నిటిని సంప్రదించిఅందరికి అంగీకారంగా వుండే పద్ధతిలో ఓటు చేయమని వారిని కోరుతామనే విషయం నేను తెలియజేసి యున్నాను. తర్వాత వారు ఏది Inter-State transaction అనేటటువంటి విషయంకూడా స్పష్టీకరిస్తారు. స్పష్టీకరించే దాని ముందు మన రాష్ట్రప్రభుత్వము తరఫున Government of India వారికి పార్లమెంటుకు కూడా తెలియ జేస్తాము. తెలియజేసి అవన్నీకూడా తెలిసికొన్న తరువాత మనము అంగీకరించడానికి అవకాశముంటుంది. సంప్రదించ వలసిన ప్రమేయము లేదు కాబట్టి సంప్రదించ కుండా చేయకూడదని యీ House లో members చెప్పిన ఉపన్యాసాలను మంత్రి చెప్పిన సమాధానాన్ని చేర్చి Proceedings అంతాకూడా వాండ్లకు పంపిస్తాము.

Mr. DEPUTY SPEAKER:- I shall now put the resolution to the vote of the House. The question is:

> "This House ratifies the amendments to the seventh Schedule to and articles 269 and 286 of the Constitution of India, proposed to be made by the Constitution (Six Amedment) Bill, 1956 as passed by the two Houses of Parliament."

The motion was carried.

# IV GOVERNMENT MOTIONS

*1) Draft Notification under section 3 of the Cotton. Transport Act, 1923 (Central Act III of 1923)*

The Hon. Sri K. OBULA REDDI:-for the sake of convenience I shall move the two motions together.

Mr. DEPUTY SPEAKER: All right.

The Hon. Sri K. OBULA REDDI:- Sir I beg to move-

APPENDIX.

" In pursuance of section 8 of the Cotton Transport Act 1923 (Central Act III of 1923), (hereinafter referred to as the said Act), that the following draft of notification which it is proposed to make in exercise of the powers conferred by section 3 of the said Act, be approved,"

DRAFT NOTIFICATION.

In exercise of the powers conferred by sub-section (1) of section 3 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923), and in supersession of the Development Department notification No. 228, dated 19th September, 1928. published at pages 1455-1461 of Part I of the **Fort Saint George Gazette,** dated the 25th September 1928 as subsequently amended, the Governor of Andhra hereby issues the following notification.

Provided that the supersession of the notification aforesaid shall **not** affect any proceedings which have been already taken or which may hereafter be taken in respect of anything done or omitted to be done under the said notification.

NOTIFICTAION

WHEREAS it is necessary for the purpose of maintaining the quality and reputation of the cotton grown in the areas in the State of Andhra mentioned in Schedule I below:-

Now, therefore, in exercise of the powers conferred by section 3 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923), as subsequently amended and in supersession of the Notification No. 344, dated 18th November 1925 at page 2244

Part I of Fort Saint George Gazette, dated 14th November 1925, the Governor of Andhra hereby prohibits–

(1) the import of cotton (Kapas, ginned cotton or cotton waste) throughout the year into the areas specified in Schedule I below, by rail, road, river and sea or by any one or more of such routes save under, and in accordance with the conditions of, a licence prescribed in this behalf ;

(2) the delivery to and the taking of delivery by, any person, of any cotton (Kapas, ginned cotton or cotton waste) at any railway station situated in any of the protected areas specified in Schedule 11 below, when consigned from a railway station not situated in the said areas, unless such person holds the prescribed licence for its import into the said areas.

The transport of cotton seed into the Northern and Western area as defined in Schedule 1 below is exempted throughout the fear from the operation of clauses (i) and (2) above.

## SCHEDULE-I.

Protected areas for cotton kapas, ginned cotton and cotton waste.

**Northern and Western area :–** This area shall consist of the districts of Kurnool (except the taluks of Markapur and Cumbum), Anantapur, Chittoor and Cuddapah.

## SCHEDULE-II

All stations from Mantralayam Road to Guntakal both inclusive, from Kurnool town to Dronachalam both inclusive, from Guntakal to Chelama both inclusive, on Guntakal–Bezwada line; from Guntakal to Bivanhaul both inclusive, from Rayadrug to Obalapuram both inclusive, from Tiruttani to Guntakal both inclusive, from Ramasamudram to Pakala both inclusive, from Pakala to Dharmavaram both inclusive and from Dharmavaram to Gutakal both incuding and from Dharmavarm to Hindupur both inclusive.'

Sri. K. Obula Reddi. 

"In pursuance of section 8 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923) (hereinafter referred to as the said Act), that the following draft of amendments to the Madras Cotton Transport Rules published at pages 575-583 of Rules supplement to Part I of the **Fort Saint George Gazette**, dated 26th December, 1950 which it is proposed to make in exercise of the powers conferred by section 7 of the said Act, be approved

DRAFT AMENDMENTS.

In the said rules -

(1) in rule (1) for the words "Director of Agriculture, Madras" the words "Director of Agricuture, Andhra" shall be substituted;

(2) in rule (1) -

(a) item (iii) shall be omitted;

(b) item (iv) shall be renumbered as item (iii);

(c) in the proviso, the words 'and cotton seed, shall be omitted;

(3) In the Annexure -

(1) in Form 'A' -

(a) for the words 'The Director of Agriculture, Madras" the words "The Director of Agriculture, Andhra", shall be substituted;

(b) in instruction (a), the words beginning from "the Combodia area" and ending with 'Northern and Western area' and Combodia area" shall be omitted;

(ii) in Forms A,B,C,D,E,F and G the words 'Cotton Seed' shall be omitted wherever they occur"

ఇది చర్చనీయాంశం కాదు. Technical point మాత్రమే. Composite Madras State తో ఉన్నపుడు ఆంధ్ర తమిళ రాష్ట్రములు కలసి ఉండేవి. ఇప్పుడు మనం విడి పడినాము. ఇది technical point మాత్రము. మనకు అను

వర్తింపచడానికి సవరణ అన్నమాట. Director of Agriculture, Madras అని ఉంటే Director of Agriculture, Andhra అని, Prohibited areas తీసు వేస్తేలి. కర్నూలు జిల్లాలు అని చెప్పి వుంటే కర్నూలు జిల్లా అని ప్రత్యేకంగా కేటాయించుకోవడం దీనికి సంబంధించింది. కేవలం మైనరు విషయం. గౌరవనీయులైన సభ్యులు approve చేస్తారని నా ఆశ.

Mr. DEPUTY SPEAKER :-Both the motions are now before the House for discussion.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :-అధ్యక్షా, మంత్రిగారు చెప్పినట్లు దాదాపు ఇది technical point మాత్రమే. ఆంధ్రరాష్ట్రం ఎప్పుడైతే విడి పోయిందో ఆ రాష్ట్రంలో ఉండే area ప్రత్యేకంగా ఒక ప్రాంతంగా ఏర్పడడం సహజసిద్ధంగానే అవుతుంది. అలాంటప్పుడు 'ప్రత్యేకం' ఏమి అవసరం వచ్చిందో నాకు తెలియలేదు. Madras Director అని చెప్పినప్పుడు, మన ఆంధ్ర రాష్ట్రం విడిపోగానే ఆంధ్ర Act ప్రకారంగా మద్రాసు డైరెక్టరు, మద్రాసు అధికారులు అని ఉన్నచోట్ల ఆంధ్ర డైరెక్టరు, అధికారి అని దానంతట అది అనువర్తించేటట్లుగ మన ఆంధ్ర Act లో ఖచ్చితంగా ఒక clause ఉంది. అందువల్ల మళ్ళీ దానిని ఎందుకు చేశారో నాకు బోధపడడం లేదు. ఈ general clause ప్రకారంగా మద్రాసులో Director అంటే, ఆంధ్ర area లోకి వచ్చినపుడు Director of Agriculture, Andhra అవుతాడు. మద్రాసు Minister అంటే, ఆంధ్ర Minister అవుతాడు. Madras Governnor అని ఉంటే ఆంధ్ర గవర్నరు అవుతాడు. ఇది regular గ clauses క్రింద ఆంధ్ర Act లో ప్రధానమైనటువంటిది. ఈ amendment చూస్తే నాకు నవ్వు వస్తుంది. అసలు substitute చేయవలసిన అవసరం లేదు. అందువల్ల దాని effect పోయిందా? ఈ G. O కు అది ఏమైనా అనువర్తించదా? వివరించవలసిందని నేను కోరుతున్నాను.

The Hon. Sri K. OBULA REDDI :-ఇది అనవసరం అని వావిలాల గోపాలక్రిష్ణయ్యగారు అంటున్నారు. చర్విత చర్వణం అయినందువల్ల వచ్చిన ప్రమాదం ఏమి లేదు.

Mr. DEPUTY SPEAKER :-ఈ రెండు తీర్మానాలను ఓటుకు పెట్టుతున్నాను. దీని అభిప్రాయాన్ని సభ్యులు ఓటు చేయవలసింది. అనుకూలంగా ఉన్నవారు ఓటు చేయడం లేని వాంఛ్లు లేదని చెప్పవలె.

Sri. K. ObulaReddi. (13th August 1956

"In pursuance of section 8 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923) (hereinafter referred to as the said Act), that the following draft of amendments to the Madras Cotton Transport Rules published at pages 575-588 of Rules supplement to Part I of the Fort Saint George Gazette, dated 26th December, 1950 which it is proposed to make in exercise of the powers conferred by section 7 of the said Act, be approved

DRAFT AMENDMENTS.

In the said rules -

(1) in rule (1) for the words "Director of Agriculture, Madras" the words "Director of Agricuture, Andhra" shall be substituted;

(2) in rule (1) -

(a) item (iii) shall be omitted ;

(b) item (iv) shall be renumbered as item (iii);

(c) in the proviso, the words 'and cotton seed, shall be omitted ;

(3) In the Annexure -

(1) in Form 'A' -

(a) for the words 'The Director of Agriculture, Madras" the words "The Director of Agriculture, Andhra", shall be substituted;

(b) in instruction (a), the words beginning from "the Combodia area" and ending with 'Northern and Western area' and Combodia area" shall be omitted;

(ii) in Forms A,B,C,D.E.F and G the words 'Cotton Seed' shall be omitted wherever they occur"

ఇది వర్ణనీయాంశం కాదు. Technical point మాత్రమే. Composite Madras State తో ఉన్నపుడు ఆంధ్ర తమిళ రాష్ట్రములు కలసి ఉండేవి. అప్పుడు మనం విడి పడినాము. ఇది technical point మాత్రము. మనకు అను

వర్తించడానికి సవరణ అన్నమాట. Director of Agriculture, Madras అని ఉంటే Director of Agriculture, Andhra అని, Prohibited areas తిరునల్వేలి, కర్నూలు జిల్లాలు అని చెప్పి వుంటే కర్నూలు జిల్లా అని ప్రత్యేకంగా కేటాయించుకోవడం దీనికి సంబంధించింది. కేవలం మైనరు విషయం. గౌరవనీయులైన సభ్యులు approve చేస్తారని నా ఆశ.

Mr. DEPUTY SPEAKER :-Both the motions are now before the House for discussion.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :-అధ్యక్షా, మంత్రిగారు చెప్పినట్లు దాదాపు ఇది technical point మాత్రమే. ఆంధ్రరాష్ట్రం ఎప్పుడైతే విడి పోయిందో ఆ రాష్ట్రంలో ఉండే area ప్రత్యేకంగా ఒక ప్రాంతంగా ఏర్పడడం సహజసిద్ధంగానే అవుతుంది. అలాంటప్పుడు 'ప్రత్యేకం' ఏమి అవసరం వచ్చిందో నాకు తెలియలేదు. Madras Director అని చెప్పినపుడు, మన ఆంధ్ర రాష్ట్రం విడిపోగానే ఆంధ్ర Act ప్రకారంగా మద్రాసు డైరెక్టరు, మద్రాసు అధికారులు అని ఉన్నచోట్ల ఆంధ్ర డైరెక్టరు, అధికారి అని దానంతట అది అనువర్తించేటట్లుగ మన ఆంధ్ర Act లో ఖచ్చితంగా ఒక clause ఉంది. అందువల్ల మళ్ళీ దానిని ఎందుకు చేశారో నాకు బోధపడడం లేదు. ఈ general clause ప్రకారంగా మద్రాసులో Director అంటే, ఆంధ్ర area లోకి వచ్చినపుడు Director of Agriculture, Andhraఅవుతాడు. మద్రాసుMinisterఅంటే, ఆంధ్ర Minister అవుతాడు. Madras Governnor అని ఉంటే ఆంధ్ర గవర్నరు అవుతాడు. ఇది regular గ clauses క్రింద ఆంధ్ర Act లో ప్రధానమైనటువంటిది. ఈ amendment చూస్తే నాకు నవ్వు వస్తుంది. అసలు substitute చేయవలసిన అవసరం లేదు. అందువల్ల దాని effect పోయిందా? ఈ G. O కు అది ఏమైనా అనువర్తించదా? వివరించవలసిందని నేను కోరుతున్నాను.

The Hon. Sri K. OBULA REDDI :-ఇది అనవసరం అని వావిలాల గోపాలక్రిష్ణయ్యగారు అంటున్నారు. పర్శిత చర్వణం అయినందువల్ల వచ్చిన ప్రమాదం ఏమి లేదు.

Mr. DEPUTY SPEAKER:-ఈ రెండు తీర్మానాలను ఓటుకు పెట్టుతున్నాను. దీని అభిప్రాయాన్ని సభ్యులు ఓటు చేయవలసింది. అనుకూలంగా ఉన్న వారు ఓటు చేయడం లేని వాండ్లు లేదని చెప్పవలె.

# IV GOVERNMENT MOTIONS

THE QUESTION IS

*1) Draft Notification under section 3 of the Cotton. Transport Act, 1923 (Central Act III of 1923)*

APPENDIX.

" In pursuance of section 8 of the Cotton Transport Act-, 1923 (Central Act III of 1923) , (hereinafter referred to as the said Act), that the following draft of notification which it is proposed to make in exercise of the powers conferred by section 3 of the said Act, be approved,"

DRAFT NOTIFICATION.

In exercise of the powers conferred by sub-section (1) of section 3 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923), and in supersession of the Development Department notification No. 228, dated 19th September, 1928. published at pages 1455-1461 of Part I of the **Fort Saint George Gazette,** dated the 25th September 1928 as subsequently amended, the Governor of Andhra hereby issues the following notification.

Provided that the supersession of the notification aforesaid shall **not** affect any proceedings which have been already taken or which may hereafter be taken in respect of anything done or omitted to be done under the said notification.

NOTIFICATION

WHEREAS it is necessary for the purpose of maintaining the quality and reputation of the cotton grown in the areas in the State of Andhra mentioned in Schedule I below:-

Now, therefore, in exercise of the powers conferred by section 3 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923), as subsequently amended and in supersession of the Notification No. 344, dated 18th November 1925 at page 2244

Part I of Fort Saint George Gazette, dated 14th November 1925, the Governor of Andhra hereby prohibits–

(1) the import of cotton (Kapas, ginned cotton or cotton waste) throughout the year into the areas specified in ScheduleI below, by rail, road, river and sea or by any one or more of such routes save under, and in accordance with the conditions of, a licence prescribed in this behalf;

(2) the delivery to and the taking of delivery by, any person, of any cotton (Kapas, ginned cotton or cotton waste) at any railway station situated in any of the protected areas specified in Schedule 11 below, when consigned from a railway station not situated in the said areas, unless such person holds the prescribed licence for its import into the said areas.

The transport of cotton seed into the Northern and Western area as defined in Schedule 1 below is exempted throughout the fear from the operation of clauses (i) and (2) above.

SCHEDULE-I.

Protected areas for cotton kapas, ginned cotton and cotton waste.

**Northern and Western area:–** This area shall consist of the districts of Kurnool (except the taluks of Markapur and Cumbum), Anantapur, Chittoor and Cuddapah.

SCHEDULE-II

All stations from Mantralayam Road to Guntakal both inclusive, from Kurnool town to Dronachalam both inclusive, from Guntakal to Chelama both inclusive, on Guntakal–Bezwada line; from Guntakal to Bivanbaul both inclusive, from Rayadrug to Obalapuram both inclusive, from Tiruttani to Guntakal both inclusive, from Ramasamudram to Pakala both inclusive, from Pakala to Dharmavaram both inclusive and from Dharmavaram to Guntakal both inclusive and from Dharmavarm to Hindupur both inclusive.'

the motion was Carried and the Rules wereado pted.

Sri. K. ObulaReddi. (13th August 1956

Mr. DEPUTY SPEAKER :- the Question is:

" In pursuance of section 8 of the Cotton Transport Act, 1923 (Central Act III of 1923) (hereinafter referred to as the said Act), that the following draft of amendments to the Madras Cotton Transport Rules published at pages 575-588 of Rules supplement to Part I of the **Fort Saint George Gazette**, dated 26th December, 1950 which it is proposed to make in exercise of the powers conferred by section 7 of the said Act, be approved

DRAFT AMENDMENTS.

In the said rules -

(1) in rule (1) for the words " Director of Agriculture, Madras" the words " Director of Agricuture, Andhra " shall be substituted;

(2) in rule (1) -

(a) item (iii) shall be omitted ;

(b) item (iv) shall be renumbered as item (iii);

(c) in the proviso, the words ' and cotton seed, shall be omitted ;

(3) In the Annexure -

(1) in Form 'A' -

(a) for the words 'The Director of Agriculture, Madras" the words " The Director of Agriculture, Andhra ", shall be substituted;

(b) in instruction (a), the words beginning from " the Combodia area " and ending with 'Northern and Western area' and Combodia area " shall be omitted ;

(ii) in Forms A,B,C,D.E.F and G the words 'Cotton Seed' shall be omitted wherever they occur "

The motions were carried and the Rules were adopted,
( At this stage Mr. Speaker resumed the chair ).

## V. GOVERNMENT BILL

*The Andhra University (Amendment) Bill, 1956.*

The Hon. Dr. B. GOPALA REDDI :-Sir, I beg to introduce the Andhra University (Amendment) Bill, 1956 and move that the Bill be taken into consideration at once.

ఇక్కడ మన శాసనసభలో ఉండేటటువంటి దాదాపు 15మంది senatorలు వెంకటేశ్వర, ఆంధ్ర యూనివర్సిటీకి సంబంధించిన వారిని, ఇంకా ప్రతిపక్ష నాయకు లందరినికూడ నిన్న ఉదయం సమావేశపరచి Vice-chancellor సమక్షంలోనే ఈ Act అంతాకూలంకషంగా చర్చించుకొన్నాము. కొన్ని కొన్ని నిర్ణయాలకు వచ్చినాము. Registered graduates constituencies నుంచి election ఇపుడు జరుగుతూ ఉన్నది. ఈAmending Bill వస్తుంది కాబట్టి ఇతర ఎలక్షనులను కొంచెం వాయిదా. వేయవలసిందని నేను కోరాను. ఆ మాదిరిగానే వాండ్లు వాయిదా వేశారు. కాబట్టి ఈ బిల్లును urgentగా ప్యాసు చేయవలసి యున్నది. ఇది మొదట reading లో కన్న రెండవ reading లో clause by clause తీసుకొన్నప్పుడు ఏ ఏ మార్పులు చేసుకొన్నామో కొంచెం మాట్లాడుకోవచ్చు. దీంట్లో fundamental గా పెద్ద మార్పులు ఏమి చేయ లేదు. Vice-Chancellor యొక్క ఎలక్షను వ్యవహారాలలో, ఉన్నదాంట్లో కొన్ని కొన్ని సీట్లు ఎక్కువ చేయడం, కొన్ని కొన్ని తగ్గించుకోవడం జరిగింది. మన అసెంబ్లీకి సంబంధించినంతవరకు ముగ్గురు అసెంబ్లీ మెంబర్లను మాత్రమే University senate కు పంపుతూ వచ్చారు. కాని ఇపుడు ఆరుగురు సభ్యులను పంపడం, అదేకాకుండా దీన్ని ప్రతిపక్ష నాయకుల సలహాల మీద 'according to the principle of proportionate representation' అనేటటువంటి సూత్రం కూడ మొదటిసారిగా అంగీకరించి నేను ఒక amendment కూడా ఇస్తున్నాను. ఇంతకు ముందు ఈ electionలు అన్ని distributive vote మీద నే జరుగుతూ వచ్చినవి. Under the principle of proportional representation అనే సూత్రాన్ని Vice Chancellor మిగిలిన మెంబర్లు అంతా ఒప్పుకొన్నారు. ఇక Academical Counil లో ఎంతమంది ఉండాలనేటటువంటి చిన్న విషయాలు మాత్రం ఉన్నాయి. ప్రధానమైన సూత్రములు దీంట్లో ఏమి లేవు. అందువల్ల 1st reading లో కన్న 2nd reading లో clause by clause తీసుకొని దీనియొక్క merits మీద మనం discuss చేస్తే మంచిది. ఇది సాధ్యమైనంత శీఘ్రంగా pass చేయవలెననికూడ గౌరవనీయులైన సభ్యులను వేడుకొంటున్నాను.

(10

The Andhra University (Amendment) Bill, 1956.

Mr SPEAKER :-Motion moved :

"That the Andhra University (Amendment) Bill, 1956 be taken into consideration at once."

Sri PILLALAMARRI VENKATESWARLU :- అధ్యక్షా, దీనిని త్వరలో pass చేయవలసిన అవసరం ఎంతో ఉంది. దీనిలో [illegible] అభిప్రాయభేదాలు లేవు. ముఖ్యంగా proportional representation గురించి ఈ నాడు విద్యామంత్రి గోపాలరెడ్డిగారు చెప్పుకొన్నందుకు [illegible]. ఈ విషయమే గతంలో శ్రీ పట్టాభిరామారావుగారు ఆనాడు విద్యామంత్రిగా ఉండి తెలుపుతూ యూనివర్సిటీ Act లో ప్రవేశపెట్టారు. మద్రాసు University Act లో కూడా ఈ proportional representation ఉంది. ఇది అన్ని యూనివర్సిటీలలో ఉన్నటువంటి విషయమే. అదే ధంగా సీట్ల సంఖ్యను ఎక్కువ చేయడం అనేది చాల ముఖ్య విషయమనికూడ అనుకొంటున్నాను. అయితే ఇక్కడ University Act లో ముఖ్యమైనటువంటి మార్పులు చేయవలసిన అవసరం ఉంది. దాని విషయంలో అక్కడ ఉన్న Vice chancellor గారిని సంప్రదించి, University Centre లు గుంటూరులోను, కాకినాడ, అనంతపురం లాంటి పెద్ద పెద్ద కాలేజీలు ఉండి, ఎన్నో ఏండ్లనుంచి అనుభవంగల lecturers, Principals ఉన్నటువంటి ప్రాంతాలలో open చేయవలసిన అవసరం ఉంది అని మేము కోరాము. ఎక్కువమంది విద్యార్థులు post graduate చదువుకోవలెనంటే విశాఖపట్టణం వరకుపోయి [illegible] మాత్రం లేరు. అందువల్ల తప్పనిసరిగా గుంటూరులో University Centres పెట్టించే దానికి వాళ్ళు ప్రయత్నం చేయాలి. అయితే వారు [illegible] పెట్టవలెనని తెలియ చేశారు. అది పెట్టినాకూడ బాగానే ఉంటుంది. గోపాలరెడ్డిగారు దానికి పూనుకొనేటట్లయితే చాల సంతోషిస్తాం. ఆ విధంగా చేయమని కోరుతూ ఉన్నాను.

అంతే కాకుండా ఈ రోజున Technical Colleges లో చేరవలెననే కుతూహలం మన విద్యార్థులలో ఎక్కువమందికి ఉంది. మన రాష్ట్రానికి కూడా చాలా అవసరంగానే ఉంది.

ఈ ఇంజనీరింగులోగాని, మెడికలులోగాని, Poly technic institutions లో గాని విద్యార్థులకు సీట్లు దొరకడం లేదు, ఎంతో ఎక్కువమంది ఇంజనీర్లు తయారు అయితేగాని రెండవ పంచవర్ష ప్రణాళిక సమగ్రంగా, జయ

ప్రదంగా నెరవేర్చుకోలేక పోతాము. లేకపోతే ఒకవేళ డబ్బు చాలినంత వుండి ఈ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా నెరవేర్చుకోవలెను అన్నప్పుడు ఈ technical personnel లోటు వచ్చి అడ్డు పడుతుంది; అనే విషయం మనం మరచి పోకూడదు. నందికొండ, వంశధార, తుంగభద్ర high level canal మొదలైన పెద్ద పెద్ద project లు అన్ని అమలు జరిగేటప్పుడు తప్పని సరిగా ఇంజనీర్ల కొరత ఉంటుంది. ఇప్పుడు ఉన్న మన ఇంజనీరింగు కాలేజీలు మన అవసరాలను తీర్చలేవు. ఇతర ప్రాంతాలనుంచి వస్తారనడానికి అన్నిచోట్ల ఇదే ఇబ్బందిలో ఉన్నాం గనుక తప్పనిసరిగా యూనివర్సిటీ authorities తో చర్చించి యూనివర్సిటీలలో shift system పొందు పరచడానికి ప్రయత్నం చేయాలని, ప్రత్యేకంగా గుంటూరులో University పెట్టే లోపున, ఒక University Centre ను ఏర్పాటు చేయడానికి మన మంత్రిగారు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :-అధ్యక్షా, విశ్వవిద్యాలయ శాసనంలో మార్పులుతీసుకొని వచ్చారు. అయితే విశ్వవిద్యాలయం amendments వచ్చినప్పుడు ఇంకా కాస్త విస్తృతంగా తెస్తారని ఆశించాము. అందులో యూనివర్సిటీ వారికి గాక ప్రభుత్వం తమ సౌకర్యానికి, లేక అభివృద్ధి కోసం Administration side చెప్పేమాటలు మాత్రం దీంట్లో చేర్చారు. దీంట్లో ఎవరికికూడ అభ్యంతరంలేదు. నా అభిప్రాయం ఈ విశ్వవిద్యాలయంలో చాల ప్రధానమైన మార్పులు కొన్ని తీసుకొనిరావలసిన అవసరం ఉంది. దాంట్లో ముఖ్యంగా వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు సెంటర్లు పెట్టడం అనేది చాలమంది ఇంకొక University పెట్టుకోకూడదా అంటున్నారు. ఇంకొక University పెట్టుకోవచ్చును.

Radhakrishnan Committee ప్రకారంగా 15 వందల మంది విద్యార్థులు ఉండేటట్లయితే పెట్టుకోవచ్చును అని వుంది. ఇపుడు గుంటూరులో లెక్క వేసి చూస్తే 5 వేలమంది college students ఉన్నట్లు తెలుస్తుంది. ఏబది వేలు High School Students ఉన్నట్లు తెలుస్తుంది. కనుక ఈ మొత్తంకూడ కలుపుకుంటే ఒక University పెట్టవచ్చును. అయితే University కి కావలసిన పరికరాలు అన్నీ సంపాదించే లోగా, University centre పెట్టమనేది ఆంధ్ర చరిత్రలో చాల పరిణామాలను కల్గిస్తున్నది. అది ఆశగానే ఉంది. కాని యింత వరకూ అమలు జరుగలేదు.

13th August 1956) (Sri Vavilala Gopalakrishnayya

మొట్టమొదట ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడినప్పుడు; తర్వాత వచ్చిన amendments ను బట్టి ఒక సెంటరు అనంతపురంలోను, మరొక సెంటరు గుంటూరులోను ఏర్పాటు చేయవలసినదని అప్పుడు అనుకొన్నారు. తరువాత ఆంధ్ర విశ్వ విద్యాలయం నుంచి తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం విడి పోయింది. ఆ వైపునుంచి ఒక సమస్య తేలిపోయింది. కాని ప్రధానంగా ఉండే టటువంటి సమస్య గుంటూరులో విద్యార్థులు పెరగడం, institutions పెరగడం, విద్యార్థులు కూడ ఉత్సాహంతో కాలేజీలలో చేరడం. దానికి కావలసిన ధనం ఇచ్చేవాండ్లు ఎక్కువ అవుతూ ఉన్నారు. మొట్టమొదట స్త్రీల కళా శాల పెట్టినప్పుడు ఇది ఎంతవరకు నిభాయిస్తుందని చాలమంది అను కొన్నారు. అప్పుడు నేను నవ్వుతూ ఒకసారి అన్నాను.

బహుశా అన్ని కాలేజీలలో ఒక రకంగా Shift system పెట్టాలంటే మహిళాకళాశాలలో మరోవిధంగా పెట్టవలసివస్తుందేమో. ఎట్లాగా అంటే Hindu College, Christian కాలేజీలలో ఒక్కొక్క క్లాసులో ఉదయం 9 గంటలనుంచి 11 గంటలవరకూ ఒక క్లాసు తర్వాత మరొక క్లాసు 1-0 గంట నుంచి పెట్టాల్సివస్తుందేమో. కాని ఇక్కడ అనేక గదులు ఖాళీగా ఉంటాయి గనుక ఒక క్లాసు 1st period ఒక రూములో తర్వాత మరొక క్లాసు Second రూములో పెట్టాల్సి వస్తుందేమోనని అనుకున్నాను. కానీ ఈవేళ చూస్తే దానికి కూడా 6 వందలమంది విద్యార్థులు రావటం చాల ఉత్సాహంగా జరగటం జరు పడుచున్నది. అందువల్ల ప్రభుత్వం కొంతసహకారం చేస్తుంది అనుకొంటున్నాను. యూనివర్సిటీవారు ఇప్పటి పరిస్థితులలో Seperate University ని పెట్ట టానికి వీల్లేదు. గనుక "Centre" గా నైనను ఏర్పరిస్తే Post Graduate Course ను జరిపించటానికి వీలుంటుంది, ఇట్లాంటిది ఎక్కడఅయినా ఉందా? అంటే ఇదివరకూ ఒకప్పుడు కోయంబత్తూరులో ప్రారంభించారు గాని అది వెంటనే పోయింది. ఈవేళ దానినే కోయంబత్తూరువారు ప్రత్యేక విశ్వవిద్యాల యంగా చేసుకోవాలని ఆలోచిస్తున్నారు. అలాగే Durham University ఉంది. దాంట్లో New-Eastle అని వేరొకటి ఉంది. అక్కడ ఒక్కొక దానిలో సమా నంగా కాలేజీలు ఉంటవి. అయితే నేను ఆ ప్రాతిపదికమీద పెట్టాలని చెప్పటం లేదు. ఒక యూనివెర్సిటీక్రింద రెండో centre కూడా ఇతర దేశాలలో అమలు జరుపబడుతూందని చెప్పడానికిమాత్రమే డర్హాం University ని ఉదాహరణకు తీసుకొని వస్తున్నాను. అందువల్ల నేను ఆవిధంగా ఒక కేంద్రమును ఏర్పరచాలని

Sri Vavilala Gopalkrishnayya.) (13th August 1956

ప్రభుత్వాన్ని కోరుచున్నాను. హైదరాబాదుకు మనం వెళ్ళబోతున్నాం. అక్కడ ఒక పెద్ద యూనివర్సిటీ ఉంది. నిజంగా చుట్టుప్రక్కలా ఎక్కడా లేనటువంటి ఒక పెద్ద యూనివర్సిటీని మనం తీసుకోబోతున్నాం. అందువల్ల వీటిని అన్నిటినీ కలిపి విద్యావిధానంలో కేంద్రీకృతమైన విధానాన్ని, వాటి స్వాతంత్ర్యాలకు భంగం రానటువంటి పద్ధతులను ఏర్పరచాలని కోరుతున్నాను. మొత్తంమీద ఆంధ్ర దేశములోని విద్యావిధానమంతా ఒక సమగ్రమైనటువంటి పద్ధతితో సాగడానికి కావలసినటువంటి ప్రాతిపదిక దీంట్లో ఏర్పడుతుందేమో ననుకున్నాం. Central Government కూడా వీళ్ళందరకూ సౌకర్యం కల్గించడం బాగుంటుంది.

రెండవ విషయం. తెలుగుకు యూనివర్సిటీలు ఎక్కువ ప్రధాన స్థానం ఇవ్వాల్సిన అవసరం ఉంది అని నేను మనవిచేయక తప్పదు. కేంద్ర ప్రభుత్వం వారు కూడా చెప్పారు. మద్రాసు ప్రభుత్వంవారు నిన్నటి రోజున Tamil medium లోనే యూనివర్సిటీ విద్యావిధానం అంతా నడవాలని నిర్ణయం చేశారు. ప్రాంతీయ భాషను వాళ్లు ముందుకు తీసుకొని వస్తున్నారు. దేశ స్వాతంత్ర్యం వచ్చినతర్వాత రాష్ట్రాలు సిద్ధించిన తర్వాత English భాషే ఉండదేమోననుకున్నాం. ప్రాంతీయభాష, వాళ్ళ సంస్కృతీ అభివృద్ధి కావాలంటే మనకు ఆంధ్రా యూనివెర్సిటీ ఏర్పడింది. యూనివెర్సిటీవారు విద్యావిధానాన్నంతా తెలుగు ప్రాతిపదికమీదనే నడపాల్సిన అవసరం ఉన్నది. ఆంధ్ర యూనివెర్సిటీవారు తెలుగు Dictionary ని తయారు చేయాలనుకున్నారు. అది ఇంతవరకూ చేసినట్లు అగుపడటంలేదు. తెలుగుకు Standard Dictionary తయారు చేయాలని అనుకొని తీర్మానం చేశారు. అందువల్ల మీ ద్వారా మంత్రిగారినీ, యూనివర్సిటీవారినీ, వారు చేసినటువంటి తీర్మానాన్ని అమలు జరపాలని కోరుతున్నాను.

తరువాత ఇంజనీరింగు కాలేజీలలో చాల అభివృద్ధి కనబడుతోంది. గుంటూరు District లో ఇంజనీరింగు కాలేజీ స్థాపించేటట్లయితే 8 లక్షల రూపాయలను ఇచ్చుకుంటాం. ఇంకా కూడా, హెచ్చుగా కావాలంటేకూడా ఇచ్చుకోవడానికి సంసిద్ధులుగానున్నాం. మాకు Engineering College పెట్టాలని కోరుతున్నారు. గుంటూరుకు వచ్చేదేమీలేదు. High Court ను కూడా మేము తీసుకొనిపోతున్నాం అని నవ్వుతూ అన్నారు. మంచిదే. High Court ను తీసుకొనిపోవడానికి మేము ఎవరూ బాధపడటంలేదు.

13th August 1956)

THE HON. Dr.B. GOPALA REDDI:- 8 లక్షల రూపాయిలను ఇస్తామన్న దెవరు?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :- ప్లానింగు కమిటీలో జిల్లా వాళ్ళందరమూ కలిసి చెప్పాం. పప్పూట కావాలంటే అప్పూటకే వసూలుచేసి ఇవ్వగలం. IInd Five Year Plan నుచియారుచేసినప్పుడు ప్లానింగు కమిటీలో Resolution న్ను pass చేసి 8 లక్షలరూపాయిలనిస్తాం గుంటూరులో కాలేజిని పెట్టండని జిల్లాలోనివారు చెప్పారు. దానికి జవాబేమీ రాలేదంటే బహుశా ఇస్తామన్న డబ్బు చాలదేమోనని అనుకున్నాం. ఇప్పుడు 8 లక్షల రూపాయలతో ప్రారంభిస్తే బాగుంటుంది. కేంద్ర ప్రభుత్వం ఆదేశించినట్లుగా పాఠశాలలకు బిల్డింగులమీద కేంద్రీకరించటం కాకుండా విద్యాభివృద్ధి పద్ధతులపై, శతాల విషయమై ఆలోచించండని వారు చెప్పారు. మన ముఖ్యమంత్రిగారు నుప్రసిద్ధులైనటువంటి గోపాలరెడ్డిగారు నిజంగా ప్రకృతిచ్ఛాయలక్రింద, ప్రశాంతమైన వాతావరణంలో (అసలు బిల్డింగుకూడా ఉండినుకోండి; అసలు వృక్షచ్ఛాయలు మాత్రమే కాదు) చదువుకొన్నారు. ఆ రెంటినీ కలిపి మనంకూడా నూతన విధానాలను తీసుకొని రాగోవునప్పుడు గురుకులపద్ధానంలాగా, అసలు బిల్డింగులకు ఎక్కువ అవసరం లేకుండా. తక్కిన పరికరాలు కావాలి. గనుక మేము 8 లక్షలతో ప్రారంభిస్తే అందుకు ప్రభుత్వం అనుజ్ఞనిస్తే తక్కిన కావాల్సిన విరాళాలన్నిటినీకూడా జిల్లాలోని అందరూకూడా భేదాభిప్రాయాలు లేకుండా ప్రయత్నించడానికి సిద్ధంగానున్నారు. అందువల్ల నేను మనవిచేసేది, తెలుగు Medium ద్వారానే Universities ను నడిపేటటువంటి విధానాన్ని ప్రభుత్వం తీసుకోవాలి. మన విద్యా విధానంలో మీరు నడిపేటటువంటి S. S. L. C. & Matriculation classes ఉన్నవి, వాళ్ళకు University వారు పరీక్షలను ఇస్తున్నారు. అందువల్ల నేను యూనివర్సిటీవారిని ఎందుకు మీరు English కు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు? English కు ప్రాధాన్య మక్కరలేదను కొంటున్నాం. తెలుగులో మార్కులు తగ్గితే మీరు pass చేయిస్తున్నారు. English లో గనుక మార్కులు తగ్గితే మీరు pass చేయించడంలేదు. తెలుగుకు ప్రాతిపదికను మీరు ఎప్పుడు వేయబోతున్నారు. భాషా ప్రాంతాల సంస్కృతి అభివృద్ధి కావాలని విశ్వవిద్యాలయాలను పెట్టుకొనే మనం, ఇంగ్లీషు భాష వచ్చేసరికల్లా ప్రాధాన్యతను ఇచ్చి, తెలుగు భాషకు ఇవ్వకపోవడం చాల విచారకరమైన విషయం. అందువల్ల నేను తెలుగుకు కావలసిన ప్రాతిపదికను

University లలో ఏర్పాటుచేయాలని కోరుతూ ఈ తీర్మానాన్ని బలపరుస్తున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI:- అధ్యక్షా, వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఈ విషయంలో చాలా పట్టుదలగా కృషి చేస్తున్నందుకు చాల సంతోషం. స్కూళ్ళలోగాని కాలేజీలలోగాని ఆంధ్రభాషలో విద్యార్థులు చదువుకొనేటట్లు చేసుకోవడం చాలా అవసరం. క్రమక్రమంగా University లలో, శాసనసభల్లో, పార్లమెంటులలో, ఇతర సివిలు కోర్టులలో ఆ భాషలోనే పరిపాలనను అంతాకూడా చేసుకోవడం అవసరమే. దీనిని ఎప్పుడు ప్రారంభించాలి; ఎట్లా ప్రారంభించాలనేటటువంటి విషయాన్ని కేంద్ర ప్రభుత్వంవారు నిర్ణయించినటువంటి Language Commission వారు చెప్పబోతున్నారు. రిపోర్టుకూడా త్వరలోనే ప్రకటించబడుతుంది. వారు ఏం చెపుతారో విందాం. ఇవన్నీ మనం క్రమేణా నిర్ణయం చేసుకోవడం మంచిదికాని, తొందరగా ఆలోచించకుండా చేసుకోవడం మంచిది కాదని నా అభిప్రాయం. అందువల్ల తెలుగుకు ఎవరూ వ్యతిరేకులు లేరు. అయినప్పటికిన్నీ కొన్ని ప్రాక్టికల్ బాధకాలున్నాయి. ఇంకా Technical terms కొన్ని రావలసి ఉన్నవి. ఈ మాదిరిగా అవన్నీ జరిగినప్పుడు తప్పకుండా మనం చేసుకొందాం. తరువాత ఇంజనీరింగు కళాశాల విషయాన్నికూడా గోపాలకృష్ణయ్యగారు ఎత్తినారు. వాల్తేరులో పోయినసంవత్సరం ఒక ఇంజనీరింగు కళాశాలను పెట్టిన విషయం మీ అందరికీ తెలుసు.

దానికి ప్లానింగు కమిషన్‌తో నాలుగు, అయిదు conference లను మేము పెట్టుకోవలసివచ్చింది. మేము దీనిని sanction చేయడంలేదు. 'మేము దీనికి ద్రవ్యాన్నివ్వడంలేదు. మీకు కావలిస్తే మీ ద్రవ్యాన్నుండి పెట్టుకోండి' అన్నమాటగా Planning Commission వారు ప్రారంభించారు. Technical Education Committee ఒకటి మద్రాసులో అప్పుడప్పుడు meet అవుతూ ఉంటుంది. వాళ్ళందరి ఉద్దేశం మనకు గ్రాడ్యుయేట్సు అంత అవసరంలేదని మనకు కావలసిందంతాకూడా, సూపర్‌వైజర్సు, ఓవర్సియర్స్, డ్రాఫ్ట్సుమెన్, అనే భావంతో వారు చెబుతున్నారు. ఉత్తర హిందుస్థానములో ఒక Graduate అయితే అతనిని Assistant Engineer గా appoint చేస్తున్నారు. మద్రాసులోగానీ, ఆంధ్రలోగానీ వీళ్ళను 5 సంవత్సరాలు జూనియర్

ఇంజనీర్లుగా పెట్టి కొంత అనుభవం గడించిన తర్వాత, నిపుణులైనవారిని Assistant Engineer లుగా వేయడం మనం చూస్తున్నాం. వారు ఉత్తర హిందూస్థాన సాంప్రదాయం ప్రకారంగా South India లో మీరు Graduates talents నంతా waste చేస్తున్నారు. ఏదో overseerలు చేయవలసినపనిని Graduates చేత చేయిస్తున్నారు అనే భావంగా వారు చెప్పుచువచ్చినారు అందువల్ల మీకు మూడవ ఇంజనీయరింగు కళాశాల అక్కర్లేదు, రెండే చాలును. కావాలి అంటే Polytecnics, Supervisory Course, Draftsmen Course లను మీరు పెట్టుకోండి అనే మాటగా పదేపదే వారు చెప్పుచున్నారు. కడపటికి మాకు వాళ్లు ఆమోదించరేమోనన్న భయంకూడా వేసింది. మేము ప్రారంభించాము. రేపు ప్రొద్దున వాళ్లు దానికి building grant ను గాని, Equipment grant ను గానీ ఒప్పరేమోనని భయపడ్డాం. కడపటికి వాళ్ళు ఒప్పుకొన్నారు అని తెలుస్తున్నది. ఏదో వాళ్ళు గ్రాంటుకూడా యిస్తారని తెలుస్తున్నది. అటువంటి పరిస్థితులలో ఈనాడు వారు 20 లక్షలో 30 లక్షలో ఇస్తారు. ఇప్పుడు Anantapur, Kakinada Colleges కు కూడా ఇస్తున్నారు. అల్లే మన యూనివర్సిటీ కాలేజీకి కూడా ఇస్తారన్నారు. ఈ మాదిరిగా ప్లానింగు కమిషన్‌వారు అభిప్రాయపడుచున్నారు ఇక ఆంధ్ర ప్రదేశ్ వచ్చినప్పుడుకూడా తెలంగాణాలో ఒకటో రెండో Engineering కళాశాలలు ఉంటాయి అని నేను అనుకొంటున్నాను. ఇవన్నీకూడా కలిసి మనకు ఆంధ్ర దేశానికి నాలుగో అయిదో ఇంజనీరింగు కళాశాలలు ఉంటే చాలు నేమో నని అనుకుంటున్నాను. ఎందువల్లనంటే కొన్ని కొన్ని ప్రాజెక్టులు ప్రారంభం అయ్యేసరికి కొన్ని కొన్ని పూర్తి అవుతూఉంటవి. ఇప్పుడు నంది కొండకు తుంగభద్రనుంచి staff నంతా కూడా మనం కావాలి అంటే పై సంవత్సరం అక్కడికి transfer చేసుకోవచ్చును. అది అయ్యేటప్పటికి గోదావరి మీద ఇంకొక స్కీము వస్తుంది. కాబట్టి ఇవన్నీకూడా ఒక్కసారిగా రావుగనుక ఇప్పుడు సంవత్సరానికి 3 వందల మంది, 4 వందల మంది గ్రాడ్యుయేట్సు తయారవుతున్నప్పుడు కొంతవరకు చాలునేమో. Engineering లో కూడా Unemployment వస్తే అదికూడా ఇబ్బందిగా ఉంటుంది.

ఇప్పుడు బెంగుళూరులో 3 Engineering Colleges ఉన్నాయి. తమిళ నాడులో 8వEngineering College పెడుతున్నారు. కావలసిన డబ్బు వుంటే

ఇంకొక కళాశాల పెట్టుకోవచ్చునని Planning Commission వారు అంటు న్నారు. ఏమైనప్పటికి grants అక్కరలేకుండా మనదగ్గర డబ్బువుంటే వేరే ఒక College పెట్టుకోవచ్చు. ఈ graduates కందరికి ఉద్యోగాలు దొరుకు తున్నాయా లేదా అనే విషయంకూడా ఆలోచించాలి.

Sri PILLALAMARRI VENKATESWARLU:- కోయం బత్తూరులో ఇంజనీరింగ్ కళాశాల పెట్టడానికి grants యిచ్చినారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- నాకా విషయం స్పష్టంగా తెలియదు. కాని grants యివ్వలేదేమో అనుకొంటాను. అక్కడ ఒక Government College, 2 private Colleges ఉన్నాయి. వాటికి ఏమి యిస్తున్నారో నాకు సరిగా తెలియదు. కాని గుంటూరులో ప్రత్యేకంగా ఒక కళాశాల కావాలంటే అది ఎంతో ఖర్చుతో కూడుకున్న విషయం. Buildings equipment కావాలి అందుకు 60 లక్షల రూ॥ల వరకు కావాలి. Recurring expenditure, Professorsకు జీతాలు ఇవ్వాలి. 5, 6 లక్షలు కావాలి. ఈ విషయాలన్నీ మనం ఆలోచించాలి. కాని ప్రస్తుతం గుంటూరులో ప్రత్యేకంగా కళాశాల అవసరం లేదనుకుంటాను. ఇప్పుడు Vizagలో ఒక (Hons.) Courses కళాశాల ఉంది.

తిరుపతిలో ఒక (Hons.) courses కళాశాల మనకు వుంది. ఈ విషయాలు University లో Academic council లో Senate లో చాలాసార్లు వచ్చింది. మద్రాసు యూనివర్సిటీలో కూడా వచ్చింది. వెంకటేశ్వర యూనివర్సిటీలో ఒక (Hons.) centre క్రొత్తగా పెట్టుకున్నాము. ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించినంతవరకు 2 (Hons.) centres ఉన్నాయి. హైదరాబాద్‌లో ఒక (Hons.) centre వుంది. ఆంధ్ర ప్రదేశ్‌కు మొత్తం 3 (Hons., centres ఉన్నాయి. బెజవాడలోనూ, గుంటూరులోనూ (Hons. centre పెట్టడానికి కొన్ని ఇబ్బందులున్నాయని యూనివర్సిటీ వారు చెబుతున్నారు. సరైన library వుండాలి, equipment వుండాలి, మంచి qualifications కలిగిన, అనుభవం కలిగిన D. Sc., M. Sc., డిగ్రీలుగల Professors కావాలి. ఇప్పుడు ఆంధ్ర యూనివర్శిటీకి material దొరకడం కష్టంగా వుంది. ఇప్పుడు వెంకటేశ్వర యూనివర్శిటీలో చాలా మంది retired Professors ఉన్నారు. Zoology లో గాని, Mathematics లో గాని, Physiologyలో గాని, retired Professorsను contract పద్ధతి మీద appoint చేసు

13th August 1956) (Dr. B. GopalaReddi

కున్నారు. దేశంలో అనుభవం కల్గిన Professors లభ్యం కాకపోవడమే దీనికి కారణం. అటువంటప్పుడు ఇప్పుడు B. A., మాదిరిగానే M. A.,ను కూడా తయారు చేయడం ఏమి ప్రయోజనం? దానికి ఒక Specialization వుండాలి. విద్యార్థులంతా ఒకచోట వుండడం చాలా మంచిదే. విద్యార్థులంతా ఒక గురువు దగ్గర శుశ్రూష చేసి, ఒకే libraryలో, ఒకే equipmentతో చదవడం మంచిది. అట్లాకాకుండా కొంతమంది వాల్తేరులోను, కొంతమంది బెజవాడలోనూ, కొంతమంది గుంటూరులోనూ, ఉండడం అంత బాగుండదు. ఇప్పుడు మనకు ప్రతి జిల్లాలోనూ Colleges వున్నాయి. B. A., వరకు ఎవరి జిల్లాలో వారు ఉండి చదువుకోవచ్చును, తరువాత M. A.; చదువ గలుగు కున్నవారు, (Hons.) చదవాలనుకున్న వారు Ph. D. D. Sc. చదువ గలుగు కున్నవారు ఒక యూనివర్శిటీకి రావాలనే ఉద్దేశంతో ఈ University Act చేయబడింది. ఇది మంచిదనే యూనివర్సిటీవారు కూడా అభిప్రాయ పడు తున్నారు. ఈ పరిస్థితుల దృష్ట్యా ఇప్పుడు గుంటూరులో ప్రత్యేకంగా Hons. కళాశాల కావాలనడం అంత న్యాయం కాదనుకుంటాను. కాని ఎప్పటి కైనా మనం ఆర్థికంగా సౌభాగ్యవంతంగా వున్నప్పుడు గుంటూరులో ఒక యూనివర్సిటీ పెట్టుకోడం మంచిదని నా అభిప్రాయం. ఇప్పుడు గుంటూరులో Agriculture College వుంది. Medical College వుంది. 2 Training Colleges ఉన్నాయి. ఎప్పటి కయినా సరే గుంటూరు జిల్లాలో ఒక యూని వర్సిటీ పెట్టడం మంచిదనే అభిప్రాయం నాకువుంది. అది 5 సంవత్సరాలలో కావచ్చు. లేక 10 సంవత్సరాలలో కావచ్చు. అక్కడివారు కూడా దీనికి ఉత్సాహం చూపిస్తున్నారు. ఇప్పుడు 8 Arts Colleges ఉన్నాయి. చాలా సంతోషించవలసిన విషయం. యూనివర్సిటీ పెట్టుకోడానికి ఇప్పుడు ధనంలేదు. అంతకన్నా వేరే కారణం లేదు. (Interruption) మనం లేకపోతే మన తరువాత వాళ్ళు వుంటారు. రోజురోజుకు ఉద్దేశాలు పెరుగుతుంటాయి. కాని క్షీణించి పోవడం యేమిలేదు. దేశం అభివృద్ధి చెందుతున్నప్పుడు అభి ప్రాయాలు క్షీణించి పోవు. అనుకున్నదానికంటే కూడా తొందరగా సిద్ధించ వచ్చును. మొన్న కృష్ణమాచారిగారు కోయంబత్తూరులో మాట్లాడుతూ "ఇక్కడ శివ యింజనీరింగ్ కళాశాల వచ్చింది U. P.లోని రూర్కీలోవలె ఇక్కడ యూనివర్శిటీకూడ పెట్టుకోవచ్చు అన్నారు. (Interruption)

Dr. B. Gopala Reddi 13 August 1956)

అది నేను చెప్పేదికాదు. ఆంధ్రప్రదేశ్ యొక్క ఆర్థిక స్థితిని దృష్టిలో పెట్టుకోవాలి. ఇప్పుడు" ఒకకోటి రూపాయలు వసూలు చేయండి. మనం ఒక యూనివర్శిటీ పెట్టుకుందాము'' అని కల్లూరి సుబ్బారావుగారు చెబుతున్నారు.

Sri PILLALAMARRI VENKATESWARLU:- ఇప్పుడు యూనివర్శిటీ పెట్టుకోడానికి అనుకూల పరిస్థితులే వున్నాయి. ప్రతికూలపరిస్థితులు ఏమి ఉన్నాయి?

The Hon. Dr. B. GOPALA REDDI:- ఇది academic question. ఈ question మద్రాసు యూనివర్సిటీలో కూడా వుంది. పాలఘాట్‌లో మలయాళం (Hons.)course పెట్టడానికి మేమంతా అంగీకరించాము. కాని దానికి చాలామంది వ్యతిరేకించారు. పాలఘాట్‌లో సైన్సర్గిక పరిస్థితి అనుకూలంగానే వుంది కదా మీరంతా వద్దంటూ రేమిటి? అని అడిగాము. అప్పుడే Hons. students అంతా ఒకే చోట, ఒకే లైబ్రరీలో, ఒకే వాతావరణంలో, ఒకే equipmentతో వుంటే బాగుంటుంది, లేకపోతే వారికి సంకుచిత భావాలు కల్గుతాయని వారు చెప్పారు. ఇది చాలా పెద్దవిషయం. ఆంధ్రప్రదేశ్‌లో 3 (Hons.) centres వున్నాయి. వాటికి తగిన facilities ఉన్నాయి. ఉస్మానియా యూనివర్సిటీ చాలా ఖర్చుతో నిర్మింపబడినది. యూనివర్సిటీని ఇంకా వృద్ధి చేయడానికి పిలవుతుంది. University Grants Commission వారు వెంకటేశ్వర యూనివర్సిటీకి కావలసిన సదుపాయములను కలుగజేస్తున్నారు. ఆంధ్ర యూనివర్శిటీ సైన్సులో చాలా పేరు పొందినది ఈ ప్రతిష్టకు భంగం కల్గనీయరాదు. ఈ విషయాలన్నింటినీ మనం దీర్ఘంగా ఆలోచించాలి. ఈ బిల్లుపై వివాద గ్రస్థమైన విషయాలేమీ లేవు. అందువల్ల ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతూ విరమిస్తున్నాను.

Mr. SPEAKER: The question is:

"That the Andhra University (Amendment) Bill. 1956 be taken into consideration at once."

The motion was carried.

*Clause 2*

Mr. SPEAKER: Motion moved:

That clause 2 do stand part of the Bill.

There is an amendment to this clause given notice by Sri Vavilala Gopalakrishnayya. His amendment is:

In line 6 of clause 2, for the existing new clause, namely, "The Principal of the University College", substitute the following-

"(iii-a) The principal of the University Colleges at Vizagapatam and Guntur."

His amendment is not in order as there is no university at Guntur. So I rule out his amendment.

The question is:

That clause 2 do stand part of the Bill.

The motion was carried.

*Clause 3*

Clause 3 was put and carried.

*Clause 4*

Mr. SPEAKER: Motion moved:

"Clause 4 do stand part of the Bill."

THE HON. Dr. B. GOPALA REDDI: Sir, I beg to move

For "Appoint any person temporarily as Vice-Chancellor to exercise the powers and to perform the duties of the Vice-Chancellor" *Substitute* "appoint any person temporarily to act as Vice-Chancellor".

Mr. SPEAKER: Amendment moved:

For "appoint any person temporily as Vice-Chancellor to exercise the powers and to perform the duties of the Vice-Chancellor" *Substitute* "appoint any person temporarily to act as Vice-Chancellor".

I do not think it makes any great change. So I shall put the amendment to the vote of the House.

Mr. Speaker-: (13th August 1956

The question is:

'For "appoint any person temporarily as Vice-Chancellor to exercise the powers and to perform the duties of the Vice-Chancellor *Substitute* " ppoint any person temporarily to act as Vice-Chancellor.

The amendment was carried.

Clause 4 as amended was put and carried.

## *Clause 5*

Mr. SPEAKER: Motion moved:

"Clause 5 do stand part of the Bill."

### *Sub-clause (1)*

THE HON. Dr. B. GOPALA REDDI: Sir, I beg to move: "In item (ii) of sub-clause (1), *for* "(8) The Principals of the University Colleges and the affiliated Colleges," *Substitute* "(8) The principal of the University Colleges and the Principals of the affiliated Colleges".

Mr. SPEAKER: The amendment is only to remove amubiguity. So I shall put it to the vote of the House. The question is: In item (ii) of sub-clause (1), for "(8) The Principals of the University Colleges and the affiliated Colleges." Substitute "(8) the Principal of the University Colleges and the Principals of the affiliated colleges."

The motion was carried.

Sub-clause (1) as amended was put and carried and adopted,

### *Sub-clause (2)*

THE HON. Dr. B. GOPALA REDDI: Sir, I beg to move: In item (ii) of sub-claus (2), for "who served the University as Vice-Chancellorc for a period of not less than three years" substitute "who served the University for a period of not less than two years as Vice-Chancellors on being elected as such under clause (a) of sub-section (1) of section 12".

Sri PILALAMARRI VENKATESWARLU:- అధ్యక్షా! Vice Chancellor గా 2 ఏండ్లు service చేయాలన్నారు. సాధారణంగా Vice Chancellor term 3 సంవత్సరాలవరకు ఉన్నది. అటువంటప్పుడు

13th August 1956)

Sri V. KURMAYYA:- అధ్యక్షా, ఇప్పుడు రాజేశ్వరరావుగారు చెప్పిన విషయాలంటె నేను వేరే చెప్పవలసిందిలేదు. కాని సిండికేట్‌లో హరిజన సభ్యులు ఎందుకు ఉండాలో చెప్పవలసిన అవసరం ఉన్నది. మద్రాసు ప్రభుత్వంవారు హరిజనుల దగ్గర జీతములు పుచ్చుకోకుండా చదువు చెప్పించేవారు. అప్పుడు ఆంధ్ర కాలేజీలలో జీతాలు పుచ్చుకొంటూ వచ్చారు. ఇది ఏమి న్యాయం? ప్రభుత్వంవారు order pass చేసిన తరువాత కూడా మీరు జీతాలు పుచ్చుకొంటారు ఎందుకు, అని నేను కట్టమంచిరామలింగారెడ్డిగారిని అడిగాను. "అది మా ఇష్టం. ప్రభుత్వం order pass చేసినంతమాత్రాన మేము అమలు జరుపాలని ఎక్కడఉంది? It is not mandatory, but obligatory rule అని చెప్పారు. అప్పుడు సిండికేట్‌లో ఒక హరిజన మెంబరు వున్నట్లయితే ప్రభుత్వంయొక్క orders ను అమలు జరుపుటకు ప్రయత్నించేవారు. సిండికేట్ ఒక executive body. మనం ఇక్కడ Cabinet లో నిర్ణయాలు చేసినట్లుగా వారు సిండికేట్‌లో యూనివర్సిటీలకు సంబంధించిన విషయాలన్ని చర్చచేసి నిర్ణయిస్తారు. నిర్ణయమైనతరువాత ఆ నిర్ణయాలు Senate లోకి వస్తాయి. వారికి వైము ఉందో, లేదో అవి అమలు జరగడానికి వీలులేకుండా వుంది.

మన ముఖ్యమంత్రిగారు చెప్పినట్లుగా కాలేజీలలో హరిజన విద్యార్థులు ఎక్కువ అవుతున్నారు B. A; (Hons)లోనూ, Medical Colleges లోనూ Law Colleges లోనూ కూడా హరిజన విద్యార్థులు ఎక్కువగానే ఉంటున్నారు. అటువంటప్పుడు వారి caste కు సంబంధించిన ఒక వ్యక్తి అయినా వారిని safeguard చేయుటకు Syndicate లో ఉండడం అవసరమే. Indian Constitution కు ఇది వ్యతిరేకం కాదు. Scheduled Castes ను రక్షించడానికి Constitution లో provide చేసివుంది.

పూనా ఒప్పందం సమయంలో గాంధీగారికి అంబేద్కర్‌కూ పండిత మదన మోహన మాలవ్యాగారి అధ్యక్షతన చర్చలు జరిగినప్పుడు స్వరాజ్యం వచ్చిన తరువాత ముందుగా అస్పృశ్యతా నివారణ చేద్దామనుకున్నారు, చేశారు. ఇప్పుడు విద్యా విషయంలో మనం చేస్తున్నాము. "Adequate sum should be reserved for the educational purposes of the Harijans" అని వుంది. ఒక member వున్నంత మాత్రాన కులతత్వం ఉండదు.

కులతత్వాలు పోవడానికే మనం ప్రయత్నిస్తున్నాము. కులాలున్నంతవరకు కులతత్వం పోవడానికి సావకాశం లేదు. ఇది చాలా మంది ఒప్పుకున్నారు. ముఖ్యమంత్రిగారు కూడా అంగీకరించాలని అభ్యర్థిస్తున్నాను. మీరు represent చేసినందువల్ల చాలా మంది ఈ విషయాన్ని గురించి discuss చేశారు. ఎవ్వరికీకూడా అభ్యంతరం లేదు. "One syndicate member should be nomianted from the scheduled castes అని Chief Minister గారు అంగీకరించాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri N. SRINIVASA RAO:- అధ్యక్షా, ఈ విషయమును హరిజన శాసనసభ్యులు move చేశారు. హరిజన శాసన సభ్యులు move చేసినట్లయితే నేను చాలా సంతోషించేవాడిని. ఈనాడు హరిజనులు ఈ స్థితిలో వుండడానికి హరిజనులే బాధ్యులనే విషయం అందరకూ తెలుసు. ముఖ్య పట్టణము, తదితర పెద్ద పెద్ద పట్టణాలలో కూడ హరిజనులకు అద్దెకు ఇళ్లు దొరకని పరిస్థితి వుంది. మనదేశం అభివృద్ధిలోకి రావాలంటే castes ను రద్దు చేయడం అవసరమని భావిస్తూ, అందుకు కావలసిన facilities కలుగ చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఇది ఒక పక్షమేగాకుండ అన్ని పక్షాలవారు కూడా ఆదరంగా చూడవలసిన సమస్య అని మీకు మనవిచేస్తున్నాను. ఎప్పుడూకూడా ధనం విషయంలోగాని సభ్యత్వాన్ని పెంచడం విషయంలోగాని, ఇతర విషయాలలోగాని చాల Conservative గా ఉండేటటువంటి మా ముఖ్యమంత్రిగారు ఇవ్వాళ చాలా generous గా అడిగిందే తడవుగా చాల ఆనందంగా accept చేస్తున్నారు కాబట్టి దీనిమీద ఎక్కువ చర్చలేకుండనే వారు లేచి దానిని ప్రకటించి సభ్యుల యొక్క హర్షామోదాలు పొందవలెననేదే నా విజ్ఞప్తి.

Sri M. SATYANARAYANA RAJU:- ఈ విషయంలో నేను ఒక amendment తీసుకు వచ్చాను. విద్యలో స్త్రీలు ఎంత వెనుక బడి ఉన్నారో hill tribes కూడా అంత వెనుకబడి ఉన్నారు. "One shall be woman and another from schedule castes and tribes" అని నేను amendment ఇచ్చాను.

13th August 1956.,

The Hon Dr. B. GOPALA REDDI:- Scheduled castes ని senate కు సంబంధించి సంతవరకు వేరు చేశాము. "Not less than four from scheduled classes and at least one from scheduled tribes" అని ఉన్నది. University కి సంబంధించినంతవరకు scheduled classes ను tribes ను వేరు చేశాము ఆ amendment ఏమిటి?

Sri M. SATYANARAYANA RAJU:- One from the scheduled caste and tribe అని, original Act లో 50% nominated by the Chancellor of whom one shall be... అని ఉన్నది. అన్నిటిలోకూడా membership పెంచుతున్నారు. అలాగే 4 అనే దానిని 5 గా చేసి of whom one shall be woman and another from scheduled castes and tribes' అనే విధంగా మార్పు చేస్తే బాగుంటుందనేది నా సవరణ. ఆ విధంగా ముఖ్యమంత్రిగారు మార్పు చేస్తారని ఆశిస్తున్నాను.

Sri A. KALESWARA RAO:- అధ్యక్ష మహాశయా, అనేక సంవత్సరాలనుంచి మన దేశంలో ప్రబలి ఉన్నటువంటి అంటరానితనాన్ని పోగొట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి మహాత్మా గాంధి నాయకత్వం వచ్చిన తరువాత దీని విషయంలో చాల శ్రద్ధ తీసుకోవడం జరిగింది. Constitution లో కూడా అస్పృశ్యతా నివారణ పెట్టుకొన్నాము. కాని ప్రతిచోట అస్పృశ్యులకుఒకటి ఇవ్వండి అనిచెప్పటానికి ఇది అస్పృశ్యతానివారణ సంఘం కాదు. Scheduled Castesఅంటే హిందూ అస్పృశ్యులు కాబట్టి హిందూ అస్పృశ్యులు కూడా వెనుకబడిన వాళ్లే రాజ్యాంగ విధానంలో ముగ్గురికి సంరక్షణ చెప్పబడి ఉన్నది. Scheduled tribes కు Scheduled castes కు 10 సంవత్సరముల వరకు శాసనసభలలో ప్రత్యేక ప్రాతినిధ్యం ఇచ్చారు. ఇంకా Muslims, Christians మొదలైన వారంతా backward communities క్రిందికి వస్తారు. హరిజనులు నిజంగా graduates అయినప్పటికీ వాళ్లకు ధైర్యం లేకుండా ఉన్నది. Inferiority complex ఉన్నది. కూర్మయ్యవంటివారు 1 రాజేశ్వరరావు వంటి వారు నిలిస్తే మేమంతా ఓట్లు ఇచ్చేవాళ్ళము. Nominations కోరితే అందులో హరిజనుల nominations 4 ఉన్నాయి. ఊరికే nominations ఇచ్చే దానికంటే కొంతమంది registered graduates లోకి వచ్చి అందరినీ కనుక్కొని వమ్ము

కూడా Syndicate లో వేయండి మేముకూడా ఉంటాము అంటే బాగుంటుంది. అప్పుడు Senate లో వారికికూడా స్థానాలు వస్తాయి. అంతేగాని ప్రతిదీ మాకు ఇవ్వండి అంటే వారితో బాటు backward communities-scheduled tribes అడుగుతారు. ఇంకా వారితో Muslims Christians మొదలైన వారంతా ఉన్నారు. అందరు Indians కాబట్టి అదేమివద్దు. అమ్మన్న రాజాగారు స్త్రీలకు అక్కర లేదనిచెప్పారు. వాళ్లకి ఇవ్వకపోతే చాల అన్యాయంగా ఉంటుంది. Whole University area లో distinguished ladies చాలమంది దొరుకుతారు. కాబట్ట స్త్రీలు ఉండడము బాగానే ఉంటుంది. Government వారు propose చేసింది బాగున్నది గనుక దీని విషయమై చేసిన సవరణలన్నీ వదులు కోవాలని కోరుతున్నాను.

Sri M. RAJESWARA RAO:- I did not mean that we are not going to contest the Elections. It is only for that purpose that we have not asked for any special representation either from the Legislative Assembly or from other bodies. Because it is only a nomination and because there is an apprehension that even they contest the elections from certain constituencies, they may not be returned. We are asking for certain safe-guards by way of nomination. It does not mean that we are not going to contest the elections. We will certainly contest and we will see how far Sri Kaleswara Rao and others will supoprt us.

Sri S. RANGANATHA MUDALIAR :- Sir, if there is to be any indulgence in favour of any Scheduled classes or tribes, the same indulgence has to be extended to Backward classes also and Mudaliars are the most backward in the Andhra State being Amamudias. At this rate where are we going to stop? I therefore suggest that Government Amendment may stand.

Sri N. K. LINGAM :- అధ్యక్షా, ఇప్పుడూ మాజాతిలో పెద్దలైనటువంటి ఇద్దరు లాయర్లు మాట్లాడారు. కాని ఈ రోజు పితామహులైన కాళేశ్వరరావుగారు అనేకవిధాలుగా మాట్లాడారు. కాని వారి దానిమీద argument చేయడానికిగాని, comment చేయడానికిగాని నాకు శక్తి లేదు. కాని వారికి ఒక మనవిచేస్తున్నాను. ఈనాడు University లలో అనేకమంది

మాలమాదిగ పిల్లలచేత జీతాలు కట్టించుకుంటున్నారు. జీతాలు కట్టుకోలేక వారు చాల బాధపడుచున్నారు హరిజన సభ్యుడేఆ Council లో ఉన్నట్లయితే ఆ బాధను నివారిస్తాడనే ఉద్దేశ్యంతో దీనిని చెపుతున్నాము. గనుక ఈ amendment ను మార్పు చేయాలని కోరుతున్నాను. 28 లక్షలు హరిజనులు ఉన్నారు, 5 లక్షలు tribes ఉన్నారు. ఈ 5లక్షలవారికి లేకపోయినా అభ్యంతరం లేదు గాని 28 లక్షలుగల ప్రజానీకానికి ఖచ్చితంగా ఒక scheduled caste వాడు ఉండేటట్లుగా ఈ amendment ను pass చేయాలని మరొకసారి ప్రార్థిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU:- అధ్యక్షా, ఇది చాల ముఖ్యమైనటువంటి సవరణ అని అనుకొంటాను అందువల్ల నిన్న కూడా దీనిని అంగీకరించాలని ముఖ్యమంత్రిగారిని, Vice Chancellor గారిని మేము కోరాము ఈనాడు ఉన్నటువంటి పరిస్థితులను యథాతథంగా తీసుకొంటే syndicate లో కూడా sheduled casteలకు తప్పనిసరిగా representation ఇవ్వాల్సిన అవసరం ఉన్నదనే విషయం స్పష్టంగా బోధపడుతున్నది. అయితే nominate చెయ్యడానికి అవకాశం ఉన్నది కదా, దానితో ఎందుకు తృప్తిపడకూడదు అంటే, ఈనాడు మనం చూస్తూనే ఉన్నాము. promotions లో కూడ అనేకచోట్ల అవకాశాలున్నప్పటికి, నిబంధనలు ఉన్నప్పటికి, ఏవిధంగా రావలసినవాళ్ళకు రాకుండా పోతున్నాయో, questions వేసినప్పుడల్లా అనేక instances బైటపడుతున్నాయి. అందువల్ల మానవస్వభావం ఈ విధంగా ఉన్నప్పుడు syndicate లో scheduled castes వారికి తప్పనిసరిగా ప్రాతినిధ్యం ఇయ్యాల్సిన అవసరం ఉన్నది. కాశేశ్వరరావుగారు చెప్పినట్లు ఇవన్నీ ప్రతి ధాంట్లోను అడుగుతున్నారు. Muslims కి ఇస్తామా? Christians కి ఇస్తామా? Backward Classes కి ఇస్తామా? ఎవరికని ఇస్తామంటే ఏ ఉద్దేశ్యముచేతనైతే గాంధీగారు దీనిని Constitution లో provide చేశారో ఆ ఉద్దేశ్యముతోనే ఇవ్వమని అడుగుతున్నారేగాని వేరేమి లేదు. దీనివల్ల scheduled castes నుంచి వచ్చే ప్రతినిధి Senate లోను Syndicate లోను కూడా effective గా వాళ్ళ voice చెప్పుకోడానికి వీలుఉంటుంది. Harijan boys కి Scholar ships విషయంలోను మిగతావాటిల్లోను కొంత అన్యాయం జరుగుతోందనే విషయం అందరికి తెలుసు. ఆ అన్యాయం జరగకుండా కొంతవరకు, కాకపోతే కొంత

వరకైనా వాళ్ళ అభిప్రాయాలు చెప్పుకోడానికి హరిజన ప్రతినిధి ఒకడైనా ఉంటే సరిపోతుంది. హరిజనులనుంచి కూడా అనేకమంది విద్యావేత్తలు, graduates వస్తున్నారనే విషయం గోపాలరెడ్డిగారు కూడా ఒప్పుకొన్నారు. Officials నుంచిగాని, non-officials నుంచిగాని వేయండి. Officials లో కూడా బాగా చదువుకొన్నవాళ్ళు ఉన్నారు. హరిజనులలో కూడా పాటుబడే వాళ్ళు చాలమంది ఉన్నారని నేను అనుకొంటున్నాను. అలాంటివాళ్ళను వేసినా నేను సంతోషిస్తాను. ఎవరినుంచి అయినాసరే ఒకరికి తప్పకుండా Syndicate లో ప్రాతినిధ్యం ఇయ్యాల్సిన అవసరం ఉన్నదని మాత్రం ముఖ్య మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తూ, వేమయ్యగారు తెచ్చిన సవరణను రాజేశ్వరరావుగారు తెచ్చిన సవరణను రెంటిని కూడా బలపరుస్తున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI:-అధ్యక్షా, దీనిమీద అందరూ కూడా తమ తమ అభిప్రాయాలను చెప్పినారు. నేను Senate లో నలుగురిని ఒప్పుకొన్నప్పుడు ఈ Amendment ను move చేయరేమో అని అనుకొన్నాను. ఏదో ఉదారంగా దీనిని press చేయకూడదని అనుకొంటారేమో అనుకొన్నాను. కాని అట్లు జరగలేదు. నా ఆశ నిరాశ అయినది. ఫరవా లేదు. మన భారతదేశంలో 36 యూనివర్సిటీలు ఉన్నాయి కాబోలు. నాకు తెలుసు, ఏ యూనివర్సిటీలలో కూడా, Scheduled Classes కు గాని, Backward Classes కు గాని, Statutory గా Syndicate లో గాని Executive Council లో గాని representation ఇవ్వాలనేటటువంటి సూచన ఎక్కడ కూడా లేదు. అంతేకాక, అన్నింటికి మనమే ముందంజ వేస్తున్నామని అంటారు. Prohibition విషయంలో మనమే ముందంజ వేశాము. కాని అది fail అయింది అంటున్నారు. అయినా ఈ విషయము లో ఇది Senate లో discuss చేసి వాళ్లయొక్క సూచనగా వస్తే అప్పుడు మనము అంగీకరిస్తే బహుళ బాగుంటుందేమో గాని వాళ్ల సూచన లేకుండా, మనకు ఇక్కడ అధికారము ఉన్నదని చేసుకోవడంవల్ల కొన్ని ఇబ్బందులు ఉంటాయేమో అనుకొంటాను. ఇప్పుడు రాజేశ్వరరావుగారు ఏదో Constitutionనుంచి quote చేశారు. కాని Syndicate లో వారికి representation ఇవ్వవలెనని గాని లేకపోతే, S.S.L.C.Boardలో representation ఇవ్వవల సిందని గాని Constitution లో ఎక్కడా లేదు. వాళ్లకు తగినంత ప్రధాన్య

న్ని వెచ్చింది వాళ్లకు Schools లోను, hostels లోను ఖర్చు పెట్టమనే ఉద్దేశము ఉన్నది. గాని వాళ్లకు ఈ academic bodies లో representation ఇవ్వవలసిందని ఎక్కడ కూడాలేదు. అంతేగాక, ఇప్పుడు ఈ శాసన సభలో, 26 మందేమో హరిజన సభ్యులు ఉన్నారనుకొంటాను. ఈ విధంగా 26 హరిజన సభ్యులు ఈ శాసన సభలో ఉండాలనేది statutory గా ఉన్నది గాని Cabinet లో ఇంతమంది ఉండాలని ఎక్కడ కూడా లేదు. కేంద్ర ప్రభుత్వము లో గాని రాష్ట్రాలలో గాని Assembly లో ఇంతమంది హరిజనులు ఉండాలని చెప్పారు. కాని Cabinet లో ఉండాలని ఎక్కడాలేదు. అయినప్పటికినీ, Central Government లో గాని, రాష్ట్ర ప్రభుత్వాలలో గాని వాళ్లకు ప్రాతినిధ్యమువస్తున్నది. అందువల్లఎక్కడకూడా Executive లో Scheduled Classes కు ప్రాతినిధ్యము ఉండాలనే మాట Constitution లో లేదు. అందువలన, Syndicate అనేది Executive body కాబట్టి దీంట్లో వారికి ప్రాతినిధ్యం ఉండాలనేటటువంటి నిర్బంధన పెట్టేకంటే, తరువాత కావాలంటే Vice-Chancellor కు, Chancellor కు చెప్పి ఎవరినైన ఒక హరిజనుని మనము nominate చేయించుకోవచ్చు. అది వేరే విషయము. అంతే గాని statutoryగాఒకతడవ nomination చేసినపుడు నలుగురిలో ఒకరు హరిజనుడు ఉండాలని శాసన బద్ధం చేయడం అంత న్యాయంకాదు. ఇదివరకు ప్రభుత్వము లోనే అటువంటి నిర్బంధన చేయనపుడు, Syndicate లో చేయవలసిన అవసరం లేదు. హరిజన విద్యార్థులకు ఏదైనా ఇబ్బందులుంటే, Senate లో చెప్పవచ్చును. లేకుంటే ప్రభుత్వంవారికి చెప్పవచ్చును. అంతేగాని వారు Syndicate లో ఉంటేనే గాని వారి ఇబ్బందులు తొలగిపోవడానికి వీలు లేదు అని మీరు అనుకోనక్కరలేదు. అంతేకాదు, రేపు ప్రొద్దున ఇక్కడ నుంచి నలుగురు శాసన సభ్యులు Senate లో ఉండబోతున్నారు. మీ ఇబ్బందులేమి ఉన్నాయో ఈ నలుగురు వాటిని దర్యాప్తు చేసుకోవచ్చును, మీ యిబ్బందులను Vice-Chancellor గారికి చెప్పవచ్చు, వ్రాయవచ్చు ప్రశ్నలు వేయవచ్చు. అంతేగాని Syndicate లో హరిజనులకు ప్రాతినిధ్యం లేనందువలన హరిజనులందరికి ప్రమాదము వస్తుందని అనుకోనక్కరలేదు. నాకు తెలిసినంతవరకు executive లో statutory గా వారికి ప్రాతినిధ్యం ఉండాలని Constitution లో ఎక్కడా లేదు. అంతేకాకుండా, Senate వాళ్లను అడగకుండా, Vice-Chancellor యొక్క అనుమతి లేకుండా ఇక్కడ మనకు

అధికారయున్నదని చేయడం మాత్రం న్యాయంగా ఉండదు. ఈ విషయములో నేను ఒక సలహా ఇస్తున్నాను. రేపు ప్రొద్దున నలుగురు శాసన సభ్యులు nominate కాబోతున్నారు. Senate లో అక్కడ ఒక విధంగా ఒక తీర్మానం పెట్టండి. దానిని వాళ్ళు గనుక ఆమోదించి నట్లయితే మనకు అభ్యంతర ముండదక్కర లేదు ఆ సందర్భంలో ఈ విషయంకూడా చెప్పండి ఎక్కడా కూడా executive లో statutory గా scheduled classesకు representation లేదని అందువల్ల ఇవన్నీ మనస్సులో పెట్టుకొని ఈ amendment ను press చేయరు గాక అని కోరుతున్నాను. అయితే ఒకటి మాత్రము నేను చెప్పుతున్నాను, నేను కావాలంటె, మీ అందరి తరఫున, ఇక్కడ ఉన్నటువంటి హరిజన శాసన సభ్యుల తరఫున ఈసారి ఒక హరిజన సభ్యుని syndicate కు nominate చేయడానికి recommend చేయండి అని ViceChancellor కు లేకపోతే Chancellor కు చెప్పమంటె తప్పకుండా చెప్పుతాను ఇంతకు ముందు రెండు terms లో Muslims కు representation ఇచ్చినారు. మా నెల్లూరులో అన్సారి B. A., B. L., Public Prosecutor అనే ఆయన రెండు సంవత్సరములనుంచి Syndicate లో ఉన్నారు. తరువాత ఇంకా ఇతరులకు, Christians, కుHarijans కు rotation క్రింద ఇస్తే మంచిదేమోననే ఉద్దేశంతో Vice-Chancellor గారు కూడ అన్నారు. అందువల్ల ఈ term లో Scheduled class కు ఇస్తే బాగుంటుందని వారందరు అభిప్రాయ పడుతున్నారని చెప్పమంటె చెపుతాను అంతేగానిఇది Statutory గా బంధించి తప్పకుండా నలుగురిలో ఒకరు హరిజనుడు ఉండాలనేటటువంటి మాట మీరు పెట్టవద్దని మిమ్ములను కోరుతున్నాను

Sri V. KURMAYYA:- ముప్పై సంవత్సరములనుంచి ఈ యూనివర్శిటీ ఉన్నప్పుడు అందులో ఒక హరిజన సభ్యుడు ఉండాలనే convention చేసి ఉండినట్లైతే ఈ రోజు ఇంత రచ్చలేక పోయేది. Constitution ప్రకారం executive లో హరిజనులు ఉండాలని లేదు. గాంధిగారు అప్పుడు ఉండడంవల్ల, ప్రతి State లో కూడా హరిజనులు ఉండడం అవసరమని ఒక healthy convention create చేసి పోవడం వల్ల ఈ రోజున హరిజనులు ఎవరు murmur చేయడంలేదు. వాళ్లనే గనుక వెయ్యకుండా ఉండినట్లయితే, ఈ హరిజను లందరు ఏమి అయ్యేవారో ఏమి చేసేవారో తెలిసిఉండేది. కనుక అటువంటి

convention దింట్లో కూడా చేయవచ్చు .ఇప్పుడుVice-Chancellor గారు కూడా ఇక్కడనే యున్నారు. కనుక Pro-Chancellor అయినటువంటి Chief Minister గారు ఈ విషయం చెప్పితే తప్పకుండా Chancellor గారు చేస్తారు. హరిజనుల రక్షణ కొరకు ఈ విధంగా ఉండాలని మేము కోరుతున్నాము. అది consider చేయాలని నేను Chief Minister గారిని ప్రార్థిస్తున్నాను.

The Hon Dr. B. GOPALA REDDI:- దీనిలో Pro-Chancellor గాని Chief Minister గాని ఏమి చేయలేరు. Vice-Chancellor recommend చేస్తారు. గవర్నరు అయినటువంటి Chancellor గారు nominate చేస్తారు. అంతేగాని Pro-Chancellor కు అధికారాలు ఏమీలేవు.

Sri V. KURMAYYA:- అయితే వారికి చెప్పవచ్చు కదా!

The Hon Dr. B. GOPALA REDDI:- చెప్పుతాను అని మట్టుకు వాగ్దానమీ ఇస్తున్నాను. Statutory గా మాత్రము పెట్టవద్దు అని చెప్పుతున్నాను. ఇదివరకు ఏ గవర్నమెంటులో గాని executive లో గాని statutory గా వీరికి ప్రాతినిధ్యం ఉండాలని, లేదని చెప్పుతున్నాను. కావాలంటే జగ్‌జీవన రామ్‌గారికి వ్రాయండి. ఇట్లా మేము కోరినాము కాని ఆంధ్ర ప్రభుత్వము వారు ఇవ్వలేదు. మాకు న్యాయము చేసిందా, అన్యాయం చేసిందా అని అడగండి. ఆంధ్ర ప్రభుత్వము అన్యాయము చేసిందని వారుకూడా చెప్పరు. ఈ విధంగా మేము reservation కోరినాము. వారు ఒప్పుకోలేదు, మాకు అన్యాయము జరిగిందని అబ్దుల్ కలాం అజాద్ గారితో మాట్లాడండి అని చెప్పండి. వారుకూడా ఆంధ్ర ప్రభుత్వము మీకు అన్యాయం చేసిందని ఏమి చెప్పరు. ఎందుకంటే ఇదంతా conventions మీద రావాలి. ఎందుకంటే ఈ దినము దీంట్లోచేస్తే రేపు ప్రొద్దునBoard of Studies లో మేము ఉండాలన వచ్చు, Legal studiesఉన్నాయి. Medical studies ఉన్నాయి. Engineering studies ఉన్నాయి. ఈ Boards లో అంతా హరిజనులకు rerepsentation కావాలి అని కోరవచ్చు. రాజేశ్వరరావుగారు కోరక పోవచ్చు. కాని రేపు ప్రొద్దున ఇంకొకరు కోరవచ్చు, Syndicate లోను, Senate లోను మా representation ఉంది కనుక 'why not in Board of studies'

why not in Board of Examiners' అనిఅనవచ్చును. కనుక ఈ మాదిరిగా చేయడం బాగలేదు. Syndicate is the supreme executive body of the university కనుక దాంట్లో statutory గా పెట్టడం బాగాలేదు. నా హామీ తీసుకోండి. I shall speak to the Chancellor and the Vice-Chancellor to see that some Harijan is nominated this time. అంతేగాని మీరు statutory గా పెట్టవద్దని కోరుతున్నాను.

తరువాత అమ్మన్నరాజాగారు స్త్రీల విషయాలను గురించి చెప్పారు. ఈ నాడు ఆంధ్ర దేశంలో అన్ని colleges లోను girls చదువు కొంటున్నారు. అన్ని communities వారు కూడా చదువుకొంటున్నారు. వాళ్లకు కొన్ని facilities, waiting rooms, tiffin rooms మొదలైన వారి సౌకర్యాలు చెప్పడాని కోసంగాని university లో ఉన్నటువంటి girls కోసంగాని, affiliated colleges లో ఉన్నటువంటి girls కోసంగాని, medical college girls కోసంగాని, వీరందరి సౌకర్యం కోసంగా, ఒక woman member Syndicate లో ఉంటే బాగుంటుంది. ఒకరు member గా ఉండి ఆ management తో చెప్పితే దానికి తగిన ప్రతిఫలము ఉంటుందనే ఉద్దేశంతో ఒక woman member ఉండాలని చేసినాము. కాని, ఒక అసెంబ్లీలో గాని ఒక పార్లమెంటులోగాని ఈ విధంగా లేకుండా, ఒక్క Syndicate లో మాత్రం ఎందుకు ఈ విధంగా ఉండితీరాలి అని పెడుతున్నారు అని అనవచ్చును. కాని దీనిని convention గా, సాంప్రదాయంగా పెట్టినప్పటికినీ ఆ క్షేపణేమి ఉండదు కాని ఒక్కొక్కప్పుడు వొత్తిడివల్ల మరచిపోవడం తటస్థిస్తుందేమోనని భయంగా ఉంటుంది. కనుకనే ఈ విధంగా చేయవలసి వచ్చింది. అందులో ఇప్పుడు మన ఆంధ్ర యూనివర్శిటీకి సంబంధించినంతవరకు నలుగురిలో ఒకరిని Vizag collector ను nominate చేయడం జరుగుచున్నది. ఎందుకంటె అనేక land acquisitions ఏవేవో ఉంటాయి కాబట్టి, వీటిలో అనుభవము గల కలెక్టరు ఉంటే మంచిదనే ఉద్దేశంతో invariably Vizag Collector is nominated to the Syndicate. మిగిలిన 2, 3 స్థానాలకు, మీకు మాకు కావాలి అని చాల వొత్తిడి వచ్చినప్పుడు ఈ women విషయం మరచిపోవచ్చునేమో అనే ఉద్దేశంతో statutory గా పెడుతున్నాము. అనేక educational institutions లో అనేక మంది బాలికలు వారికి తగిన సౌకర్యాలు లేక కష్టపడు-

తున్నారు వారికి కావలసిన సౌకర్యాలు ఈ విధంగా కల్పించడానికి వీలుగా ఉంటుందేమోననే ఉద్దేశంతో చేస్తున్నాము. అదిconvention క్రింద వదలివేస్తే ఒక్కొక్కసారి మరచి పోతారేమో అనే ఉద్దేశముతో, statutory గా ఉంటె మంచిదని ఈ విధంగా చేశాము, ఇది కూడ Syndicate లో కూడా ఆలోచించి వారి ఆమోదంమీదనే చేశాము గాని కేవలం మాయొక్క అభిప్రాయం మాత్రం కాదు. అందుచేత నా assurance మీద దీనికి పెట్టిన objection ను ఉపసంహరించు కొంటారని రాజేశ్వరరావుగారు తమ amendment ను ఉపసంహరించు కొంటారని వారిని నేను కోరుచున్నాను.

Sri M. RAJESWARA RAO:- I am not pressing my amendment inview of the assurance given the by Hon. Chief Minister.

Sri S. VEMAYYA:- ఇప్పుడు ముఖ్యమంత్రిగారు చెబుతూ నేను Vice Chancellorతో చెప్పి వారికి ఇవ్వటానికి సిఫార్సుచేస్తానని అంటున్నారు.

The Hon. Dr. B. GOPALA REDDI:- నేను Vice Chancellor తో చెప్పగలనన్నానుగాని, వేయిస్తానని అనలేదు.

Sri S. Vemayya:- చట్టరీత్యా చిక్కువస్తుందని గూడ అంటున్నారు కాని స్త్రీలకు ఏవిధముగా ఉన్నదో అదేవిధంగా హరిజనుల విషయములో గూడ వర్తిస్తాయి. అందువల్ల యిప్పుడు యీ అధికారము యిచ్చినందువల్ల యిక్కడ executive body లో, లేకపోతే యివ్వనందువల్ల ప్రభుత్వానికి వచ్చే నష్టమేమీ లేదు అప్పుడు యీ ముఖ్యమంత్రి మారిపోయి యింకొక ముఖ్యమంత్రి రావచ్చు. ఇంకొక ఆయన వస్తే, అప్పుడు ఆయన మాత్రము సిఫార్సు చేస్తారన్న నమ్మకము ఏమి ఉంటుంది? కాబట్టి యిది చట్టరీత్యా ఉంటే తప్ప యిది జరిగేది కాదు. కాబట్టి యిప్పుడు ముఖ్యమంత్రిగారు యిచ్చే assurance చాలా ప్రమాదమయినదని చెబుతాను. వారి assurance తోబాటుసభ్యులందరుకూడతృప్తిపడడమే కాని, ఆతృప్తి మితముగాఉన్నది. ఏమైనప్పటికినీ, యిది చట్టరీత్యా చేయడము మంచిదని నా అభిప్రాయము. అందువల్ల నా సవరణను నేను press చేస్తున్నాను.

13th August 1956.

Mr. SPEAKERt- Leave of the House is granted to Sri M. Rajeswara Rao to withdraw his amendment. I shall now put Sri Vemayya's amendment to the vote of the House.

The question is:

"Before the proviso to clause 7, add the following:-
"and one from the Scheduled Castes and Tribes."
The amendment was declared lost. Sri P. Venkateswarlu pressed for a division. Voting by counting of heads was taken and 16 voted for the amendment and 43 against the amendmnt.

The amendment was lost.

Mr. SPEAKER :- Sri M. Satyanarayanaraju also gave notice of a similar amendment. In view of the result of Sri Vemayya's amendment, Sri Satyanarayanaraju's amendment does not arise.

Clause 7 was put and carried.
Clause 8 was put and carried.

Classe 9

The Hon. Dr. B. GOPALA REDDI:- Sir, I move the following amendment :-

In Section 22 of the principal Act:-

In Sub-section (i) :- (a) under the heading " Class I - Ex-officio Members' , for clause (3) , the following shall be clauses substituted, namely:-

(3) The Director of Agriculture.
(4) The Director of Animal Husbandry.
(5) The Director of Medical Services.
(6) The Principal of the University Colleges and the Principals of the affiliated colleges.
(7) Such members of the Syndicate as are not otherwise members of the Academic Council".
(b) Under the heading "Class II Other Members":-
(i) In Clause (1) for the words "three persons", the words 'five persons' shall be substiuted.

13th August 1956

Mr. SPEAKER :- The question is :

In Section 22 of the principal Act:-

(1) In sub section (i) :- (a) under the heading "Class I-Ex Officio Members, for clause (3) ,the following clauses shall be substituted, namely:-

(3) The Director of Agriculture.
(4) The Director of Animal Husbandry.
(5) The Director of Medical Services.
(6) The Principal of the University Colleges and the principals of the affiliated Colleges.
(7) Such members of the Syndicate as are not otherwise members of the Academic Council,,.

(b) Under the heading " Class II - Other Members :-

(i) In clause 1 for the words ' three persons' the words 'five persons' shall be substituted.

The amendment was carried

Sri VAVILALA GOPALAKRISHNAYYA:- Mr Speaker I beg to move the following amendment:-

Add the following after new sub-clause (5) in subclause (1) of Clause 9

'5 a - The Chief Engineer (General)'

అధ్యక్షా, ఇప్పుడు ఒక ప్రత్యేక పరిస్థితి ఏర్పడుతున్నది. ఏమిటంటే, Director of Agriculture, Agriculture departmnent కుHeadగా ఉంటున్నాడు. Medical section వచ్చేటప్పటికి Director of Medical Services ఉన్నారు. అట్లాగే Animal Husbandry ఉన్నారు. Engineering-College కు వచ్చేటప్పటికి, దానికి సంబధించిన హెడ్డును యూనివర్శిటీలో వేస్తున్నారు. అదేవిధముగా ఏ డిపార్టుమెంటుకు ఆ డిపార్టుమెంటల్ హెడ్డు ఉంటూ ఉంటాడు. వారినే University లో వేస్తున్నారు. కాని Engineering-college కు సంబంధించి Director of Public Instruction ను యూనివర్శిటీలో వేస్తున్నారు. వారిని వేయడం చాలా ఆశ్చర్యముగా ఉన్నది. యూనివర్సిటీలో డిపార్టుమెంటల్ హెడ్సు represent చేయాలంటే. ఏ డిపార్టు

మెంటువారినిఆడిపార్టుమెంటుతరఫునవేయాలిఅ'గ్లాలేకుండాEngineeringdepartmentతరఫునDirector of Public Instructionనుఏవిధంగా ఏస్తున్నారు? ఇది చాలా serious గా ఆలోచించ వలసిన విషయము Engineer general గా యితర పనులకు ఉంటే, Engineering అంటే Technical Knowledgeఅవసరంయి అప్పుడు Engineering department తరఫున director of Public Instruction ను పంపితే, ఆ యన కు Technical Knowledge ఎక్కడనుంచి వస్తుంది?

Education కు Technical knowledgeకు ఎలాంటి సంబంధను లేదు Director of Public Instruction కు education విషయమే తెలిసిఉంటుంది Technical knowledge, Engineer కు తెలిసి ఉంటుంది. ఏ ఏ డిపార్టుమెంటు యొక్క సిలబస్‌ను గురించి చర్చించటానికి, ఆయా డిపార్టుమెంటుకు సంబంధించిన expert ను పంపడము న్యాయము. దానికి సంబంధించిన Board of Studies ఉంటారు, వారు తయారు చేస్తారు. లేదా యింకా ఎవరెవరో తయారు చేస్తారు. Departmental Head, administrative head గా ఉంటాడు, ఆయన Academic Head కావటానికి వీలు లేదు.Academic Head గానే కాకుండా Administrative Head గా ఉంటున్నాడు అందువల్ల ఇంజనీరింగు డిపార్టుమెంటు ఎక్కువగా technical knowledge తోటి సంబంధించింది గనుక, Chief Engineerగారేసెనేటు attend అయ్యేటట్లుగా ఉంటేనే అది సరియైన పద్ధతి అనిపించుకుంటుంది. ఈ మూడు సీట్లను వారికి యివ్వక పోవడమువల్ల, విధానములో లోపము కన్పిస్తున్నది. Engineering Colleges తరఫున Director of Public Instruction ను ఏర్పాటు చేస్తున్నారు. తక్కిన వాటికి మాత్రము Technical knowledge అవసరమున్నప్పుడు డిపార్టుమెంటల్ హెడ్డును పంపిస్తారు.పోనీ, technicalగావస్తున్నారంటేEngineering Head Engineering technic తెలిసినవాడు, Medcine కు సంబంధించినవారు Director of Medical Services, Agriculture కు Director of Agriculture, ఉన్నారు. ప్రభుత్వం యొక్క పాలసీ ప్రకారము Agriculture కు Departmental expert ఉండాలని ఎక్కడా లేదు. Agriculture కు సంబంధించినవాడు ఉంటే, విధిగా ఒక expert ఉండాలని ఎక్కడా కూడా లేదు. అనేకసందర్భాలలో I. C. S. వారినివేశారు. Agriculture కు I. G. Naidu

గారిని వేశారు. Agriculture లో ఆయనకు ప్రవీణత ఉన్నది, గనుక ఆయనను వేశామని అనటానికి వీలులేదు. ఇప్పుడు అదే పాయింటుమీద Director of Medical Services ను పెట్టుతారా? నిజమే, కాని Medical కు సంబంధించినవాడు కాబట్టి వస్తున్నాడు. కాని ఈ అసందర్భము ఏమిటో మాకు అర్థము కావడము లేదు. ఈ అసందర్భము సరి చేయటానికి, ఆ ఇంజనీరింగు సెక్షనుకుకూడ ఆయననే పెట్టడం బాగా ఉంటుంది. వీటికి అన్నింటికి academic గా సంబంధించిన education విధానం కావాలంటారా? Director of Public Instruction ను పెట్టితే మాకేమి అభ్యంతరము లేదు. కాబట్టి ఆ సెక్షనుకు సంబంధించినప్పుడు ఆయననుకూడ పెట్టాలని అంటున్నారు.

Sri S. RANGANATHA MUDALIAR:- Mr. Speaker Sir, when he wants 'Chief Engineer' to be added, may I know which Chief Engineer he is, whether Public Works, Electricity, Highways or Irrigation.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:- రంగనాథ మొదలియార్ గారి అనుమానమునకు యింతాకనే జవాబు చెప్పాను. Engineering Colleges కు సంబంధించిన Section Head గా ఉండడానికి ఎవరైతే వీలు అవుతుందో వారినే వేయవలసిందిగా కోరుతున్నాను. ఈ రోజున ఎవరూ లేరని అంటారా? అసలు నేను ప్రధానంగా చెప్పేది యేమిటంటే, Some Head of the Department కు తక్కిన Institutions అన్నీ అప్పచెప్పుతున్నప్పుడు, దీనికి Head of the Department లేడా? Engineering Section లేదా? ఉంటే, ఎందుకు వేయడములేదు? ఆ section కు సంబంధించిన హెడ్డుకు ఆ Institution యివ్వకుండా Director of Public Instruction కు ఎందుకు యివ్వవలసివచ్చింది అనేదే ప్రశ్న యిక్కడ.

**Mr. SPEAKER**.-You are repeating the same thing over and over again.

**Sri VAVILALA GOPALAKRISHNAYYA**:- వారు అడిగినారు కనుక నేను సమాధానము చెబుతున్నాను.

(13th August 1956)

The Hon. Dr. B. GOPALA REDDI :-ఇది చాలా పెద్ద విషయము. ఇది ఎన్నోసార్లు యూనివర్సిటీలో చర్చించబడిన విషయమే. నిన్ననే Vice-Chancellor కూడ మెంబర్లకందరికి చాలా విపులముగా చెప్పారు. ఏమని అంటే, Chief Engineer కు ఈ Syllabus కు ఏ మాత్రము సంబంధము లేదు. ఒకవేళ వేయదలచుకుంటే, Chief Engineer అనేవారు నలుగురు ఐదుగురుగా ఉన్నారు. వారిని వేయదలచుకుంటే, Highways Chief Engineer ఉన్నాడు. Sanitary Engineer ఉన్నాడు, Irrigation Chief Engineer ఉన్నాడు. Civil Works Chief Engineer ఉన్నాడు కేంద్రంలో Radio Engineer ఉన్నాడు. ఇంకను Television కు Chief Engineer ఉన్నారు. ఈ మాదిరిగా Chief Engineer అనేవారు చాలామంది ఉన్నారు. వీరందరికి Syllabus తోటి touch లేదని, ఇది Engineering Colleges కు సంబంధించింది గనుక, ఈ Syllabus తో Director of Public Instruction కు సంబంధము ఉన్నదని, ఇంజనీరింగు డిపార్టుమెంటు కూడ Director of Public Instruction క్రిందనే ఉంటున్నది కాబట్టి, ఈ Syllabus వ్యవహారమంతా, ఆ డైరెక్టరే చూస్తాడు గనుక ఆయనను యూనివర్సిటీకి వేశారు. అందువల్ల Chief Engineer అక్కరలేదని Vice-Chancellor చాలా విపులముగా చెప్పారు. ఆ ప్రకారముగా చూస్తే, ఇప్పుడు Law College ఉన్నప్పుడు అది Chief Justice క్రింద ఉన్నందున, ఇక ఆయనకూడా యూనివర్సిటీకి వెళ్ళవలసి ఉంటుందనా గోపాలకృష్ణయ్యగారు చెప్పేది ?

Sri VAVILALA GOPALAKRISHNAYYA :-ముఖ్యమంత్రిగారు "లా కాలేజీ ఉన్నప్పుడు High Court Chief Justice కు దానితోసంబంధము ఉన్నది గనుక, వారు కూడా వెళ్ళవలసిందేనా," అని అంటున్నారు. నిజానికి చూస్తే, లా కాలేజీ Chief Justice కు సంబంధించినదే కాబట్టి ఆయనకూడ వెళ్ళవలసిందే. కాని ఆయన డీన్‌గానో, మరొక designation తోనో Head of the Department గా ఉంటున్నాడు. కాని సిండికేటులో దీనిని ఆయనే నిర్వహిస్తున్నాడు. అయినప్పటికినీ ముఖ్యమంత్రి గారు Chief Justice గారి సంగతి తీసుకుని వచ్చారు. ఆయనకుకూడ ఒక సీటు ఇవ్వవలెనని అభిప్రాయము.

Mr. SPEAKER :- The question is :-
Add the following after new sub-clause (5) in sub-clause (1) of clause 9.

"(5) (a). the Chief Engineer (General)".
The motion was lost.

The Hon. Dr. B. GOPALA REDDI :-Sir, I move the following amendment :-

"(ii) after clause (2) the following clause shall be added namely :-

"(3) Five persons nominated by the Chancellor of whom two shall be headmasters of schools in service in the university area at the time of nomination":

(2) in sub-section (ii) :-

(a) for the words 'fifteen persons' the words 'twenty-five persons' shall be substituted;

(b) the forlowing proviso shall be added at the end, namely :-

"provided that not less than four persons shall be co-opted as Members from the teaching staff of the oriental colleges."

Mr. SPEAKER :- The question is :
(ii) after clause (2) the following clause shall be added, namely :-

"(3) Five persons nominated by the Chancellor of whom two shall be Headmasters of schools in service in the University area at the time of nomination";

(2) in sub-section (ii) :-

(a) for the words 'fifteen persons', the words 'twenty-five persons' shall be siubstituted;

(b) the following proviso shall be added at the end namely :-

Mr. Speaker) (13th August 1956.

"provided that not less than four persons shall be co-opted as members from the teaching staff of the oriental colleges."

The amendment was carried.

Clause 9 as amended was put and carried.

Clause 10 was put and carried.

Clause 11 was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

The Hon. Dr. B. GOPALA REDDI :- I move, Sir,
'That the Bill be passed into law.'

ఇప్పుడు మొదటి పర్యాయము syndicate membersకుండా acadamic council కుexofficio members అగుచున్నారు. మన amendment వల్ల ఇన్ని రోజులనుంచి syndicate member లకు, acadamic council తో సంబంధము లేనిది ఈనాడు కల్పించబడుతున్నది. మద్రాసు, అన్నామలై వెంకటేశ్వర Universityలలో syndicate members exofficio acadamic council members అగుతున్నారు.అది అవసరంకూడా అనిచాలా రోజులనుండి అనుకొంటున్నాము. Act amend కు లేదు కాబట్టి syandicate members కు acadamic council కు సంబంధము లేకుండా ఉండింది. ఇప్పుడు ఈ కొత్త amendments వల్ల అదికూడా జరుగుతూ ఉంది.

Mr. SPEAKER :- Motion moved

'That the Andhra university (Amendment) Bill, 1956 be passed into law.'

Sri. VAVILALA GOPALAKRISHNAYYA :- ఇప్పుడు ఈ బిల్లును మన మందరము సుహృద్భావంతో Pass చెయ్యబోతున్నాము. ఇదిచాలా సంతోషమైన విషయము. ఈవిధముగామార్పులుతీసుకొని వచ్చినపుడే ఈబిల్లు చేసిన ప్రయోజనం ఉంటుంది. దానిలో (1) సెక్షను ప్యాసు చేసినాము. syllabus, curriculam మార్పుచేస్తే ప్రభుత్వాన్ని consult చేయనవసరం లేదని విశ్వవిద్యాలయం చెయ్యవచ్చునని చెబుతున్నాము Examination Board ఉన్నది కాబట్టి అపుడప్పుడు ఉన్న పరిణామాలను కూడా అర్థము చేసికొని పని చెయ్యాలని కోరుతూ నేను దానిని బలపరుస్తున్నాను.

(13 August 1956

Sri M. RAJESWARA RAO :- అధ్యక్షా, ఈ బిల్లు Act గా ప్యాసు చేసేముందు ఒక విషయం Chief Ministerగారి దృష్టికి తేదలచుకున్నాను. నేను గత సంవత్సరంనుంచి సెనేటుకు వెళ్ళుతున్నాను అక్కడ కొంతమంది intelligent elected సభ్యులకు ఒక అపోహ బయలుదేరింది. అక్కడ ఎక్కువమంది officials. exofficio members College Principals, Professors వారుపది అనుకుంటే అది carry out అవుతుంది, మా అభిప్రాయములను సరిగా అర్థము చేసికొని మాకు due prominance ఇవ్వడము లేదు అనే అభిప్రాయము మాకు ఎక్కువగా ఉన్నది. కొంతమంది సభ్యులము మేము ఒక Independent group గా తయారు కావాలనే అభిప్రాయమునకు వచ్చినాము. కొంతమంది officials ను తగ్గించవలెనని అనుకున్నాము. అయితే ఆంధ్ర విశ్వవిద్యాలయ బిల్లు విద్యా విషయములకు సంబంధించినది కాబట్టి విద్యావేత్తల అభిప్రాయములను మనము ప్రాధాన్యముగా తీసుకుంటే మంచిదనే ఉద్దేశముతో మేము అలాంటి views ను బలపరచలేకపోయినాము. అయినా అది తగ్గించవలసిన అవసరం ఉన్నది. last senate మీటింగులో elected members మీద తీవ్రమైన నిందా రోపణలు జరిగినవి. elections తీసి పారవేయవలెనని అక్కడ అందరూ nominated మెంబర్లే ఉండవలెనని అన్నారు. ఎన్నికలు, ప్రజాస్వామ్యం అన్ని రంగాలలో ప్రజాభిప్రాయం వెల్లడించవలెనని, ప్రజాభిప్రాయం ప్రకారం నడువవలెనని అనే రోజులలో విద్యాధికులు ఇటువంటి అభిప్రాయానికి దోహదం ఇవ్వడము విచారకరమైన విషయము. ఈ మధ్యను University Commission వారు ఇచ్చిన recommendations ను బట్టి కబీరు కమిటీ రిపోర్టును బట్టి చాలా తీవ్రమైన మార్పులు తీసుకొని వచ్చారు. ఈమార్పులవల్ల ఇదివరకు ఉన్న అభిప్రాయం బలపడుతున్నది. అలాగే elected, nominated, exofficio మెంబర్లకు ఉన్నట్టి అవినాభావ సంబంధములు ఎక్కువ అగుతవేమో మనము చూడవలసి ఉన్నది. ప్రభుత్వానికి కూడ దీనిలో బాధ్యత ఉన్నది కాబట్టి, దీనికి అయిన ఖర్చు మనము భరిస్తున్నాము. కాబట్టి University కి మన అభిప్రాయములను చెప్పవలసిఉన్నది. కనుక elected, non-elected bodies కు మధ్య ఉండవలసిన సంబంధములను చక్కపరచడంకోసం ప్రభుత్వం శ్రద్ధ వహించవలెనని నేను ప్రత్యేకముగా మనవి చేస్తున్నాను.

13th August 1956.) (Sri M. Rajeswara Rao

ఇంక రెండవ విషయము. మనము ఎంత చిన్న ambiguity వచ్చినా కూడా బిల్లు తీసికొని రావడము అలవాటు అయిపోయింది. ఇతర దేశాలలో, ఇంగ్లండు, ఇతర ప్రజాస్వామికముగా అభివృద్ధి చెందిన దేశాలలో చట్టములు కాకుండా conventions ఎక్కువగా ఉన్నవి. మన దేశములో ముఖ్యముగా ఆంధ్రప్రాంతములో conventions చట్టానికి భేదము లేకుండా ఉన్నది. అది పెద్దవారు వ్యవహరిస్తున్నారేమో అని గట్టిగా అనవలసి వస్తున్నది.

Sri T. JIYYAR DASS:- అధ్యక్షా, పరకాయ ప్రవేశం అని ఉంది. విద్యా మంత్రిగారు చెప్పినటువంటి భావాన్ని మా సుబ్బారావుగారు చెబుతూ ఉన్నారు. విద్యా మంత్రిగారి నాయకత్వం క్రింద మేమందరం కూర్చొని సంతోషిస్తున్నాము. కాబట్టి విద్యామంత్రిగారి వకీలుని వారే చెప్పడం అవసరమని మీద్వారా తెలియజేస్తున్నాను.

Mr. SPEAKER:- ఈ interpretation అవసరం లేదండీ.

Sri PILLALAMARRI VENKATESWARLU:- అధ్యక్షా, మొత్తంమీద ఈ బిల్లు చట్టం కాబోతుంది. గతంలో లేని కొన్ని ముఖ్యమైన మార్పులు మనం చేయగలిగాము Senate కు కొంతమందిని Scheduled Castes నుంచి tribes నుంచి కొంత మందిని పంపించ గలిగాము. Proportional representation అనేద్వారా మన అసెంబ్లీనుంచి ప్రతినిధులను పంపించడానికి కూడా చేశాము. చాలా ముఖ్యమైన మార్పులు చేశాము. ఈనాడు House లో ఏ విధమైన అభిప్రాయాలు వచ్చినాయో, సభ్యుల యొక్క భావాలు ఏ విధంగా ఉన్నాయో, ఇవి అన్నికూడా మనముఖ్య మంత్రిగారు దృష్టిలో పెట్టుకొని, University మీద వారికి ఉన్న పలుకుబడిని ఉపయోగించి ఆ విధంగా సభ్యులయొక్క అభిప్రాయాలు కొంచెము ప్రతిబింబించేటట్టుగా చూస్తారని నేను పూర్తిగా ఆశిస్తున్నాను. Syndicate లో representation విషయంలో కాశేశ్వరరావుగారు ఒక విషయం చెప్పారు. పెద్దవారు చెప్పకుండా ఉంటారేమో అని ఎంతో ఆశించాను. ఇపుడు division పెట్టినందుకు గాను మాదితప్పు క్రింద తీసుకొని వచ్చారు. మేము, కాంగ్రెసు పార్టీవారే amendment ఇవ్వక పూర్వమే, amendment ఇవ్వటం జరిగింది. అందరిలో ఏ విధమైన భావం ఉందో అదే భావం వేమయ్యగారిలో ఉంది. అంధ.

రికి కూడా Syndicate లో హరిజనులు ఉంటే బాగుంటుందనే అభిప్రాయం ఉండి amendment ఇవ్వడం జరిగింది పోనీ, అవతల ఉండేటటువంటి వారు కూడా గోపాలరెడ్డిగారు ఇచ్చినట్టి హామీతో పూర్తిగ సంతృప్తి చెందారా అంటే లేదు. అలాంటప్పుడు తప్పనిసరిగా వారియొక్క భావాన్ని వ్యక్తము చేయాలి. చేస్తే ఫలితం తప్పక ఉంటుంది అని ఆశించాము. ఫలితం వచ్చిందని కూడా శ్రీయుడు కాశీశ్వరరావు గారి ఉపన్యాసంవల్ల స్పష్టమైంది. కాశీశ్వరరావుగారు దీనిని conventional గా చేసి తీరవలెనని అన్నారు. చేసేటట్లయితే ఈ amendment suggest చేసే వాండ్లము కాము. ఇది convention చేస్తామంటే మేము కూడా ముఖ్యమంత్రిగారు ఇచ్చినటువంటి హామీని అంగీకరించి తప్పని సరిగా ప్రయోగం చేయవలసిన అవసరంకూడా లేదని చెప్పి ఉండే వాండ్లము దురదృష్టవశాత్తు కాశీశ్వరరావుగారు ఏది చెప్పినప్పటికైనాసరే రాజకీయాలు, పార్టీలు తప్ప ఇంకొక విధంగా ఆలోచించే శక్తి వారికి పూర్తిగా పోయింది. ఇక వస్తుందనికూడా నేను అనుకోను. అంత్యకాదు. పోనీ ఆ భయంచేతనైనా సరే ఈ schedule l castes, tribes, backward comm unities యొక్క అభివృద్ధికోసం మీరు కృషి చేసినట్లయితే చాల సంతోషిస్తాము. అందులో అన్ని విధాలుగా బలపరుస్తాము అని కూడా హామీ ఇస్తూ ఈ బిల్లును పూర్తిగ బలపరుస్తున్నాను.

Sri M. RAJESWARA RAO:- అధ్యక్షా, మనము Constitution ను రచించి దేశములో పెట్టినప్పటినుంచి కూడా చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. కాని ఆ విషయాలను గురించి చెప్పడము భావ్యముకాదు. కాశీశ్వర రావుగారు చెప్పారు. హరిజనులు యీ వేళ ముందుకురావాలని Senate లోను Syndicate లోను ఎన్నికలద్వారా రావాలన్నారు. తప్పకుండా రావడానికి ప్రయత్నం చేస్తాము. కాని ఒక ఉదాహరణ తీసికోండి. Christians లో చాలా పైకి వచ్చినటువంటివారు M.A. లు B. A. లు చదివినటువంటివారు వున్నారు. వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం అవసరంలేదు. వారు direct గా ఎన్నికలలో పోటీ చేసినా కూడా వస్తారని మనమంతా అభిప్రాయపడి వున్నాము. శాసనగత ఎన్నికలలో చూస్తే Christians ఒక్కరు కూడా యీ శాసనసభలో లేరని మనవిచేస్తున్నాను.

Sri M. RAJESWARA RAO:- ఆంధ్రనిరెడ్డిగారు Caste hindus లోనుంచి convert అయినవారు. అందుచేత యీవేళ హరిజనులను అందరినీ ఎన్నికలద్వారా తీసుకురావాలని మేముచెప్పితే ఏమిలాభము లేదు. అది unilateral ఔతుంది. ఇతరులు కూడా ఆ అభిప్రాయము కలిగివుండాలి. Senate లోగాని Syndicate లోగాని హరిజనుని తీసుకోడానికి అభ్యంతరము లేదు. కాని ఇంతవరకూ ఎప్పుడు కూడా తీసుకున్నట్లు కనబడలేదు. హరిజనుని Cabinet లోగాని executive body లోగాని తీసుకోవాలని constitution లో లేదని గోపాలరెడ్డిగారు చెప్పారు. నిజమే. హరిజనులను తీసుకోవడము convention, గాంధీగారి సిద్ధాంతము హరిజనులను uplift చేయడమే. హరిజనుడు లేకుండ ఎప్పుడూ లేదు. ఈ Syndicate లో 14 మంది మెంబర్లు వున్నారు. ఈవేళ ఏడుమంది వున్న Cabinet లో ఒక హరిజన సభ్యుడున్నాడు. 14 మంది వున్న Syndicate లో ఒక్క హరిజనుడు కూడా లేడు. ప్రతిదానికి బిల్లురావడం హరిజనులకు representation యివ్వకపోవడము చాల అసహ్యమని అనిపిస్తుంది ఒక్కొక్కసారి. అసలు మీరంతా ముందుకువచ్చి మాకు encouragement యిస్తే మాకు ఈ representation అవసరము లేదు. అందుకోసము పెద్దలైనటువంటి వాండ్లు విద్యాధికులైనటువంటి వాండ్లు మాకంటే బాగా అర్థము చేసుకునే వాండ్లు అక్కడ యూనివర్సిటీలో వున్నారు. కాబట్టి వారు చెప్పిన convention ప్రకారం యివ్వడానికోసము తగిన ప్రోత్సాహము యిస్తారని ఆశిస్తున్నాను. రెండవది ముఖ్యంగా యూనివర్సిటీలో చదివే విద్యార్థుల పరిస్థితి ఏమి ఆలోచించడములేదు. అదేనాకు చాలా బాధగా ఉంది. ఇప్పుడు గోపాలరెడ్డిగారికి కూడా తెలుసు. ఎంతోమంది ఆడవాండ్లు సైతము అక్కడ Vizag నుంచి ఇక్కడి colleges కు వస్తే Hostel accomodation లేదు. Law College Hostel లో ఒక్క room లో 14 మంది వున్నారు. ఒక్క room కూడా సరిగలేదు. ఇలాంటి పరిస్థితులను సరిపెట్టుకోలేకుండ వున్నాము. దీనిని develop చేసుకోడానికి శక్తిలేకుండా పోయినా కూడా వెంకటేశ్వర యూనివర్సిటీ ఇంకొకటి కూడా పెట్టుకున్నాము. సంతోషమే. జిల్లాకు ఒక University పెట్టడము చాల సంతోషం. మేము కూడా కోరేది అదే. కాని ముందున్న యూనివర్సిటీని బాగుచేయడం కోసము ప్రత్యేకమైన శ్రద్ధ వహించాలని నేను Chief Minister గారికి ఈ సందర్భములో మనవిచేస్తున్నాను. మీరు grant

M. Rajeswara Rao) (13th August 1956

యిస్తారో, డబ్బు యిస్తారోగాని, అక్కడవున్న విద్యార్థులకు తగినటువంటి వసతులు కల్పించాలి. వారికి తగిన ఏర్పాటులు చేయడానికి మనకు శక్తి లేనపుడు ఇప్పుడున్న Private Colleges లో Honours Courses Philosophy, History, Geography courses పెట్టుకోడానికి వారికి అవకాశము కల్పించండి. మనము యూనివర్సిటీలను గురించి ఎప్పుడు ఆలోచించినా అక్కడవున్న విద్యార్థులపరిస్థితులుఎలావున్నాయి. అక్కడ యిచ్చేinstructions ఎలా వున్నాయని ఆలోచించాలి. మొన్న గోపాలరెడ్డిగారు అనకాపల్లిలో మాట్లాడుతూ Lecturers కు జీతాలు ఎక్కువచేయాలని కోరిన సందర్భములో మన ఆంధ్రదేశంలో standards చాల తక్కువగా వున్నాయి. అది చాల విచారకరమైనదని అన్నారు. మీరు జీతాలు ఎక్కువ కావాలంటారు. కాని విద్యార్థుల అభివృద్ధిగాత్రము, ఏమాత్రము సంతృప్తికరంగా లేదనే అభిప్రాయము వారు ప్రకటించారు. దీనితో మేమందరము ఏకీభవిస్తున్నాము. ఈరోజు I.A.S. కు వెళ్ళితే ఒక్కరు కూడా సరిగా పాస్ కావడం లేదు. ఆంధ్రులు నలుగురు వున్నారని Chief Minister గారిచ్చిన reply చూస్తే చాల విచారకరంగా వుంది, అంటే యీstandardలో వుండే defect ఇది.అది జీతాలవల్ల వచ్చిందో మరెందుకో మీరు జాగ్రత్తగా ఆలోచించవలసిన అవసరముంది. అందుచేత యూనివర్సిటీలోని standard అభివృద్ధిచేసుకోడానికి తగిన శ్రద్ధ మనము తీసుకోవాలి. అట్టి convention ను మనము ఏర్పాటుచేసుకోవాలి. Elected bodies కు non-elected bodies కు కూడా మనము సరియైనటువంటి అవినాభావ సంబంధాలు ఏర్పాటుచేసుకున్నట్లయితే యూనివర్సిటీలో మనము చక్కని సాంప్రదాయాన్ని సూచించినవాండ్లమౌతాము. ఇతరులకు కూడా మార్గదర్శకులము ఔతాము. గోపాలరెడ్డిగారు చాలా కాలంగా Pro-chancellor గా వుంటూ వచ్చారు. Life member కూడా అనుకుంటాను. ఇంకొక విషయం వారు గుర్తించాలి. ఈ బిల్లు మనము pass చేస్తున్నామంటే దీనికి సంబంధించిన కొన్ని మార్పులు వెంకటేశ్వర యూనివర్సిటీలో కూడా రావలసిన అవసరం వుంది అనుకుంటాను. ఈ బిల్లు, ఆ బిల్లు ఒకే State లో వున్నాయి కాబట్టి మనము different standards ఏర్పాటుచేసుకోవడము లేదు కాబట్టి రెంటిని పరిశీలనచేసి ఎలాంటిబేధము లేకుండా మార్పులు తీసుకురావడానికి చూడాలి

విద్యలో మనకు regional కులతత్వాలలో అవసరంలేదు. అంతా కూడా ఒకే basis మీద నడవాలనుకున్నాము కాబట్టి అవసరమైన amendments ఆ బిల్లులో కూడా తీసుకురావాలని ప్రార్థిస్తూ సెలవుతీసుకుంటున్నాను.

Sri A. KALESWARA RAO:-అధ్యక్షమహాశయా, నేను బిల్లును గురించి ఒక్కమాట మాత్రమే మనవిచేస్తున్నాను హరిజన members అంతా కూడా తప్పకుండా ఒక హరిజన సభ్యుడు ఉండాలని కోరారు. దానిని oppose చేయడము చాలా కష్టమైన సంగతి. ప్రధానమంత్రిగారు విద్యామంత్రిగారు Pro-chancellor గా వున్నారు గనుక వారికి చాలా పలుకుబడి వున్నది. వారు ఒక convention ను ఏర్పాటు చేస్తామన్నందుకు మనమంతా సంతృప్తి పొందాము. వేమయ్యగారి amendment మీద వారి party lines మీద దానిని press చేస్తామన్నారు. దానిమీద కాంగ్రెస్‌కు హరిజనులలో అప్రతిష్ట లేవాలని స్వాభావికంగా వుంటుంది వాండ్లకు. ఐనప్పటికీ అందరము కలిసి దానిని ఓడించాము. హరిజన సభ్యులకు embarassment కూడా వచ్చింది. ఈ హరిజనులయొక్క అంటుదోష నివారణ అనేది మన nation కే sacred trust. అన్ని విషయాలలో వాండ్లను అభివృద్ధికి తీసుకురావాలి. ఒక్కసారి హరిజనులంటే Tribes వస్తాయి, backward communities వస్తాయి. కాబట్టి మన విద్యామంత్రిగారుతమ పలుకుబడిని ఉపయోగించి Legislative Assembly ద్వారా తప్పకుండా ఒక హరిజనుని పంపడము మంచిది. వీలుగా వుంటే Senate లో elect చేయిస్తే మరీ బాగుంటుంది. ఒకవేళ గనుక హరిజనుడు syndicate లో రాకపోతే nominate ఐనా చేసి ఒక convention తప్పకుండా ఒక హరిజనుడు ఎప్పుడూ వుండేటట్లుగా చేస్తే బాగుంటుందని నేను గట్టిగా మనవిచేస్తున్నాను. మన విద్యామంత్రిగారు యిచ్చిన హామీకి నేను కృతజ్ఞత తెలియపరుస్తూ యీ బిల్లును అందరూ అంగీకరిస్తారని నేను మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri K. SUBBA RAO :- అధ్యక్షా, కాళేశ్వరరావుగారు మాట్లాడిన తర్వాత మాట్లాడవలసి వచ్చింది. విద్యామంత్రిగారు ఎప్పుడూ శాశ్వతంగా convention గా పెట్టేటటువంటి పరిస్థితి చేస్తానని చెప్పలేదు. [illegible] వారికి చెప్పి, Syndicate లో హరిజనులకు రక్షణకల్పించేటట్లు ఏర్పాటు మాత్రం

Sri K. Subbarao) (13th August 1956)

చేస్తానని చెప్పినారు. అంతే కాని ఇది మళ్ళీ మూడవ reading లో అది convention గా పెట్టినారు అనేటటువంటిదిగా వాగ్దానము చేశారని మళ్లీ నక్షత్రకుడు కనపడే వ్యవహారం కాకుండా వాండ్ల వాండ్ల శక్తిసామర్థ్యాలనుబట్టి అదంతటదే వస్తుంది. ఈ విద్యాసంస్థలలో అందులో ఉన్నత విద్యాసంస్థల విషయంలో ఇటుల ఒక్కొక్క విషయాన్ని గురించికూడా స్థనశల్య పరీక్ష చేసుకొనబోయి అది కావాలి ఇది కావాలనేటటువంటిది సరియైనది కాదు. ఈ ఉన్నత విద్యా పీఠాన్ని సరియైన స్థితిలో పెట్టడానికి విద్యామంత్రిగారు దీనిని ఉన్నత స్థాయిలోకి తీసుకుపోవాలని ప్రార్థన. ఇంతటితో విరమిస్తున్నాను.

Mr. SPEAKER :-The question is :-

"That the Andhra University (Amendment) Bill, 1956 be passed into Law."

The motion was carried and the Bill was passed into Law.

The House then adjourned to meet again at 8-30 A. M., the next day.

## APPENDIX

*Vide answer to D. R No. 18 (S. No. 65) printed at page 15 supra.*

# CONSTITUTING THE STATE KHADI AND VILLAGE INDUSTRIES BOARD.

1. The Minister (Planning & Industries) -Sri Kala Venkata Rao - Chairman.
2. Sri Malli Madugula Kothandaramaswamy-Visakhapatnam.
3. Sri Erneni Subrahmanyam, Gandhi Ashramam, Komaravolu, Gudivada Taluk, Krishna District.
4. Sri V. Veerabadramam, Managing Trustee, Anandashram, Mydukur P. O, Cuddapah District.
5. Sri S. Gurubatham, Ex-Minister, Santipuram, Kuppam, Chittoor District.
6. Sri K. Kondaiah, Andhra Chemicals Ltd, Nidadavole.
7. Sri Neti Chalapathi Rao, Secretary, Harijan Sevak Sangh, Guntur.
8. Srimathi Buchi Krishnamma, Seethanagaram.
9. Sri Pragada Kotaiah, M. L. A., General Secretary, The Andhra Handloom Weavers Congress, Nidubrolu, Guntur District.
10. Sri R. Prasad, I. C. S, Secretary, Department of Industries, Co-operation & Labour.
11. Sri K. Subrahmanyam Naidu, M. A., I.A.S., Registrar of Co-operative Societies, Andhra, Madras.
12. Sri S. R. Kaiwar I. C. S., Director of Industries & Commerce, Andhra - Secretary.
13. Sri Narayanamurthy, Kojjilipet, Masulipatam, Krishna District.
14. Sri Dukka Ranganna Reddy, Malya-Putti P. O., Via Tekkali, Srikakulam District.
15. Sri Kallur Subbarao, M. L. A. (Deputy Speaker)
16. Regional Organiser, All India Khadi & Village Industries Board, Andhra Branch, Kakinada.
17. Development Commissioner and Secretary Planning & Development Department.

